# ఆంధ్రపత్రిక

317379





The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 15 SATURDAY 16th APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Rao


## "జర్మనీ సరిహద్దుల మార్పు స్థిరపరిష్కారం కాజాలదు"

### డచ్చి పార్లమెంటులో అధిక్షేపణ

హేగ్, ఏప్రిల్ 14: అయిరోపాఖండ పశ్చిమరాజ్యాలవారు జర్మనీయొక్క సరిహద్దులను మార్పు చేయుటకు ఒక పద్ధతిని సూచించిరి. ఈ మార్పు పద్ధతిని ఆయా పశ్చిమరాజ్యాల ప్రభుత్వములు ఆమోదించవలసి యున్నది. హాలెండు ప్రభుత్వము యీ మార్పులను క్రోడీకరించుచు ఒక చిత్తు చట్టమును తయారుచేసెను. ఈ చిత్తు చట్టము రెండవ శాసనసభలో ఆమోదింపబడెను. కాని మొదటి శాసనసభలో ఇంకా ఆమోదింపబడలేదు.

ఎప్పటికైనను జర్మనీతో సంధి పత్రమును వ్రాసికొనవలసి యున్నది. ఆ సంధి పత్రము వ్రాసికొనబడునప్పుడు ఇప్పుడు నిర్ణయింపబడిన సరిహద్దులు స్థిరంగానే ఉంచబడునను నిశ్చయములేదు. కనుక యీ సరిహద్దు మార్పులు స్థిరమైనవి కాజాలవు. అదిన్నీగాక జర్మనీవద్దనుండి ఆయా ప్రాంతములను తీసికొని కలుపుకొనుటకంటె, ఆ ప్రాంతాలకు బదులుగా కొంత నష్టపరిహారమును అధికంగా తీసికొనుట శ్రేయస్కరము అని కొందరు సభ్యులు ఎగువ శాసనసభలో వాదించుచున్నారు. హాలెండుకు జర్మనీ రాజ్యము వెనుకతట్టున అండగా కాపుదలగా నుండదగినదేశము. కనుక, హాలెండుకూ జర్మనీకి ఉండే పరస్పర సద్భావమును చెడగొట్టుట మంచిదికాదు. ఈ కారణముల వల్ల జర్మనీ సరిహద్దుల మార్పుకు సంబంధించిన పట్టమును డచ్చి పార్లమెంటు ఎగువ శాసనసభవారు ఆమోదించుటకు సందేహించుచున్నారు.

### బెర్లిను సమస్య

#### అమెరికను కార్యదర్శి అభిప్రాయము

వాషింగ్‌టన్, ఏప్రిల్ 14: జర్మనీ సమస్యపై బెర్లిను ప్రతిష్టంభనను తొలగించేనిమిత్తము పునఃచర్చలను ప్రారంభించ రష్యా సూచనలు చేయుచున్నదను వార్తలనుగూర్చి ప్రశ్న వేయగా అధ్యక్షుడు ట్రూమన్ వ్యాఖ్యానించ తిరస్కరించెను. ట్రూమన్ వారం వారం జరిగే పత్రికా విలేఖరుల సమావేశములో మాట్లాడెను. క్రిందటి రోజున కార్యదర్శి డీన్ ఏచిసన్ ఈ విషయమును గురించి చెప్పవలసినదంతా చెప్పెవనెను. అగ్రరాజ్యములు నాలుగు సంప్రతింపులు జరపుటకు బెర్లిను ప్రతిష్టంభనే ప్రతిబంధకమని అమెరికా అనేక పర్యాయములు తెలియజేసినట్లు డీన్ ఏచిసన్ తెలిపెను. సోవియటు రష్యాతో వున్న సమాచార సౌకర్యములను పేటెని రద్దుచేయలేదనీ, చేయ ఆలోచించుటలేదనీ కూడ ఆయన చెప్పెను.

### జర్మన్ భాషలో గాంధీజీ ఆత్మకథ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 13: మహాత్మా గాంధీ "మై ఎక్స్‌పెరిమెంట్స్ విత్ ట్రూత్" అనేపేరుతో వ్రాసిన ఆత్మకథ త్వరలోనే జర్మన్ భాషలోనికి అనువదించబడుతుంది.

జాతిపునాదకుడు మహాత్మాగాంధీ ఆస్తికి కర్తల అనుమతికై అభ్యర్థించావలసి ఉన్నదని చేరినవార్తలవల్ల తెలుస్తున్నది.

బ్రస్సెల్సు, ఏప్రిల్ 14: అట్లాంటిక్ ఒప్పందమువల్ల మొదటి 3 సం॥ లలో బెల్జియమును మామూలు కన్న 40 లక్షల ఫ్రాంకులు సైనికవ్యయ మవునని అనధికార అంచనా వేయబడినది.

### లార్డ్ బాయిడ్ - ఆర్

లండన్, ఏప్రిల్ 14: లార్డ్ బాయిడ్ ఆర్ దంపతులు నేడు విమానంలో ఇండియాకు బయలుదేరిరి. ఇండియాలో వారు 3 వారాలపాటు భారత ప్రభుత్వపు అతిథులుగా ఉంటారు. ఇదివరకు ప్రపంచ ఆహార వ్యవసాయ సంస్థకు డైరెక్టరుగా పని చేసిన లార్డ్ బాయిడ్ ఆర్, ఈ 3 వారాలలో భారతదేశంలోని ఆహార వ్యవసాయ పరిస్థితులను పరిశీలించును. ఇండియానుండి ఆయన అమెరికావెళ్లి జూన్ చివరకు స్వదేశానికి చేరుకొనును.

### యూరప్‌లో పాకిస్థాన్ ప్రధాని విశ్రాంతి

కరాచీ, ఏప్రిల్ 14: లండన్‌లో అధినివేశ ప్రధానుల సమావేశమునకు హాజరైనపిమ్మట పాకిస్థాన్ ప్రధాని లియాకతాలీఖాన్ యూరప్‌కు వెళ్లి కొద్ది రోజులు విశ్రాంతి తీసుకుంటారని విశ్వసనీయంగా తెలియవచ్చినది. పెర్షియా ప్రభుత్వం లియాకతాలీఖాన్‌ను తమ దేశానికి కూడా రావలసిందని ఆహ్వానించింది.



ఢిల్లీలో గతవారాంతాన జరిగిన రాష్ట్రప్రధానుల సభ దృశ్యం: చెన్నరాష్ట్రప్రధాని కుమారస్వామిరాజాగారు కుడివైపున మూడవ స్థానంలో ఆసీనులైవున్నారు.

## 'ప్రపంచ శాంతికి అమెరికావల్లనే ప్రమాదం కలుగుతున్నది'

### సమితిలో అట్లాంటిక్ సమాఖ్యపై జెక్ ప్రతినిధివిమర్శ

### బ్రిటిష్ ప్రతినిధి సమాధానం

ఫ్లషింగ్ మెడోస్, ఏప్రిల్ 14: ఐక్యరాజ్యసమితి జనరల్ అసెంబ్లీలో అట్లాంటిక్ ఒడంబడికపై నిన్న ఆంద్రే గ్రోమికో చేసిన విమర్శనల అందిపుచ్చుకొని జెకోస్లావాకియా ప్రతినిధి డా॥ అడోల్ఫ్ హాఫ్‌మైస్టర్ నేడిట్లు ఉపన్యాసం చేసెను:

"రష్యాపై దూరాక్రమణ జరపడానికే పాశ్చాత్యరాజ్యములు ఈ ఒడంబడిక చేసుకొన్నవి. ప్రపంచాన్ని ద్వధా విభక్తం చేయడమే ఈ ఒడంబడిక లక్ష్యం. అమెరికా చేతిలో ఉన్న సర్వశక్తులూ సమస్త అంగబలమూ చివరకు బ్రాడ్వేలోని హాస్య నటకులు సైతం ఈ లక్ష్యమునకు సాధనములుగా ఉపయోగించబడుచున్నారు. ప్రపంచంమీద సార్వభౌమత్వం చలాయించే హక్కు అమెరికాకు స్వతస్సిద్ధమని వారి అభిప్రాయం. ప్రపంచశాంతికి ప్రమాదం కల్గించుచున్నది అమెరికాయే గాని రష్యా కాదు."

వీటో ప్రయోగమును పరిమితం చేయవలెననే ప్రతిపాదనపై జనరల్ అసెంబ్లీలో చర్చ జరుగుతుండగా, ఆంద్రే గ్రోమికో అట్లాంటిక్ ఒడంబడిక ప్రస్తావన తెచ్చి పాశ్చాత్య రాజ్యములపై 12 విమర్శలు ప్రారంభించెను. ఆవిమర్శనే నేడు జెకోస్లావాకియా ప్రతినిధి కొనసాగించెను. బ్రిటిష్ స్టేట్ మంత్రి హెక్టర్ మాక్నీల్ ఈ విమర్శలకు సమాధానంగా ఇట్లు ఉపన్యసించెను.

"ఉన్నత పదవికి ప్రమోషన్ వచ్చినందుకు గ్రోమికోగారిని ముందుగా అభినందించ గోరుచున్నాను. కొత్త ఉద్యోగం రావడంతో గ్రోమికోగారి పాత పద్ధతులు మారవచ్చునని పలువురు ఆశించిరి. కాని దురదృష్టవశాత్తు, అట్టిది జరుగలేదు.

ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక గూర్చి అంతగా చర్చించవలెనని రష్యన్ ప్రతినిధికి ఉండే జనరల్ అసెంబ్లీ చర్చనీయాంశ ప్రణాళికలో దానిని సూటిగా చేర్పించి ఉండవలసింది, అంతేగాని ఇలా అసందర్భంగా చర్చలోకి విషయాంతరాన్ని జొప్పించి ఉండవలసిందికాదు. ఈ ఒడంబడిక కేవలం ఆత్మరక్షణోద్దేశంతో చేశారన్న ఒడంబడికయేనని సాక్షి చెబుతూ మాక్నీల్ ఇలా అన్నాడు: "సోవియట్ యూనియన్‌పై దురాక్రమణకు నార్వే సన్నాహాలు చేస్తున్నదంటే ఎవరైనా నమ్మగలరా?

ప్రపంచ ప్రజలయోగక్షేమముల కొరకే తాను వీటోను ప్రయోగించుచున్నదని రష్యా చెబుతున్నది. ఇది సత్యదూరమైన పచ్చి ప్రగల్భం. ఇటువంటివారలతో గ్రోమికో మన సమయాన్ని వృథా చేస్తున్నాడు. మన వివేచనా శక్తిని న్యూనపరుస్తున్నాడు. సిలన్ పెట్టిన సభ్యత్వ దరఖాస్తును వీటో చేయడం కూడా సమితిని ఉద్ధరించడం కోసమేనా? శాంతిప్రియులైన ప్రజలలో కూడిన ఈ చిన్నిలెడుదేశం ప్రపంచరాజ్య సమితిని కూలదోయునని ఆనేనా రష్యా భయపడుతున్నది. ఐక్యరాజ్యసమితి అనే మహావృక్షాన్ని మూలచ్ఛేదం చేయడానికి ఉద్ధత పరశువుతో సింహాళం ఎత్తివస్తున్నదని రష్యా భయపడుతున్నదా?

### పరిషియాలోని రషియా రాయబారి

టెహరాన్, ఏప్రిల్ 14: సంప్రతింపుల నిమిత్తము రష్యను రాయబారి వాన్ సడ్జికొవ్ రేపు మాస్కోకు పోవుచున్నాడు.

## 'గత 18 నెలలలో దక్షిణాఫ్రికా భారతీయులస్థితి మరీ అధ్వాన్నమైనది'

### ఎం. డి. నాయుడుగారి ప్రకటన

ఫ్లషింగ్ మెడోస్, ఏప్రిల్ 14: గత 18మాసములలో ద. ఆఫ్రికా భారతీయుల స్థితిగతులు అధ్వాన్నమును చుండెనని ఇప్పుడవి మరింత దుర్భర మగుచుండెనని ద. ఆఫ్రికా భారత కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడు శ్రీ ఎమ్. డి. నాయుడుగారు నేడిచ్చట ప్రకటించిరి.

న్యూఢిల్లీ నుండి నేటి ఉదయము విమానములో శ్రీ నాయుడుగారు యిచ్చటికి విచ్చేసిరి. ద. ఆఫ్రికా భారతీయుల యెడల ఆదేశ ప్రభుత్వము వలంబించుచున్న వైఖరిపై వారు ఐక్యరాజ్యసమితియందలి భారత రాయబారవర్గమునకు సలహాయిచ్చును.

ద. ఆఫ్రికాయందు యిప్పుడు అధికారము వహించుచున్న జాతీయ ప్రభుత్వము అనుసరించుచున్న విధానముల మూలముననే భారతీయుల స్థితి యింత దుర్భరముగా నున్నదని చెప్పుచు శ్రీ నాయుడుగారిట్లనిరి: "ఇటీవల డర్బనులో భారతజాతి వారికిని, ఆఫ్రికన్‌జాతివారికిని జరిగిన కొట్లాటలు తిరిగి ప్రారంభమగునట్లు కనిపించుచున్నది. జాతివైషమ్యమును పెంపొందించు విధానము ముఖ్యముగా భారతీయులపై ద్వేషము పురికొల్పువిధానమును ద. ఆఫ్రికా ప్రభుత్వమువారు సాగించుచున్నారు. ద. ఆఫ్రికా ప్రభుత్వమువారు తమదేశస్థులయెడల అవలంబించుచున్న వైఖరివిషయమై ఐక్యరాజ్యసమితి జనరల్ ఎసెంబ్లీ 1946 సం॥ములో అవలంబించిన తీర్మానము ననుసరించి ముందడుగు వేయుటకు ఐక్యరాజ్యసమితి యేదోపద్ధతి కనుగొనవలెనని ద. ఆఫ్రికా భారతీయులు వాంఛించుచున్నారు. అంతరంగిక విజ్ఞప్తులవల్ల ద. ఆఫ్రికా ప్రభుత్వవైఖరిని మార్చు మార్గమేమియూ కనిపించుటలేదు. జాతివైషమ్యముపై ఆధారపడు ద. ఆఫ్రికా విధానములను మార్పించుటకు ప్రపంచ ప్రజాభిప్రాయము యొక్క ఒత్తిడితప్ప మరేమార్గము కనిపించుటలేదు. ద. ఆఫ్రికా నల్లవారికిగల యిబ్బందులు అనుభవపూర్వకముగా నాకు తెలియును. ద. ఆఫ్రికా భారతకాంగ్రెస్ రాయబారిగా నేను భారతదేశం వెళ్లియుంటిని. అచ్చటనుండగా ద. ఆఫ్రికానుండి, ద. ఆఫ్రికా కాంగ్రెస్ ప్రతినిధిగా అమెరికాకు ఒక్కనిరప్పించుటదుర్లభంగానున్నట్లు నేను తెలిసికొంటిని. భారతదేశమునుండి నేను అమెరికావచ్చుటకు కష్టములేవియూ లేకుండెను. ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశము ముగియువరకు అమెరికాలో నేనుండ నుద్దేశించుచున్నాను."

## జనుం ఎగుమతిపై భారతదేశంతో పాకిస్థాన్ ఒప్పందం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: పాకిస్థాన్ నుండి ఇండియాకు ఎగుమతిఅయే ముడి జనుముమీద ఎగుమతి పన్ను లేకుండా చేసే విషయమై ఇండియా, పాకిస్థాన్ ప్రభుత్వాలకు ఒక ఒడంబడిక కుదిరినదని తెలుస్తున్నది. దీనివలన భారతీయ జనుము ఉత్పత్తిదార్లకు ఇతర ఉత్పత్తిదార్ల పోటీని తట్టుకునే వీలుకలుగుతుంది.

ఈవిషయమై ఈమధ్య భారతీయ జనుము ఉత్పత్తి దార్లతో ఇండియా ప్రభుత్వం సంప్రదింపులు జరిపినప్పుడు, ఉత్పత్తిదారులు ఏప్రిల్‌నుండి సెప్టెంబర్ వరకూ ఉత్పత్తిలో 8 వ వంతును తగ్గించుట కనుమతించమని కోరినారనీ, ముడి జనుము సప్లయి సక్రమంగా లేనందున ఇది అవసరమని వాదించినారనీ తెలుస్తున్నది. అయితే ప్రభుత్వం దానికి అంగీకరించక కొంతకాలం వేచిమాడవలెనని చెప్పినదని తెలుస్తున్నది. ప్రస్తుతం జనుము ఉత్పత్తి, ఎగుమతులు తగ్గిపోతే, మన విదేశ వ్యాపారంలో పెద్దసంకటం ఏర్పడగలదని ప్రభుత్వం హెచ్చరించింది.

ఈ విషయమై త్వరలోనే ఒక అధికార ప్రకటన వెలువడునని తెలుస్తున్నది.

### బల్గేరియా ప్రధాని అస్వస్థత

సోఫియా, ఏప్రిల్ 14: బల్గేరియా ప్రధాని డిమిట్రోవ్‌కు అస్వస్థతగా ఉన్నందువల్ల ఉద్యోగమునకు సెలవిన్వబడినదనీ, ఆయన ప్రస్తుతం సోవియట్ యూనియన్‌లో చికిత్స పొందుతున్నారనీ నేటిరాత్రి అధికారరీత్యా ప్రకటించబడినది.

### సమితికి శలవు

ఫ్లషింగ్ మెడోస్, ఏప్రిల్ 14: శుక్రవారంగాని శనివారంగాని, ఐక్యరాజ్య సమితి సమావేశం యుండదు. అవసరమైతే గురువారం రాత్రి సమావేశమవును.

### లండన్‌కు డా॥ మలాన్ ప్రయాణము

కేప్‌టౌను, ఏప్రిల్ 14: లండన్‌లో జరుగు కామన్‌వెల్తు ప్రధానుల సభకుగాను ద. ఆఫ్రికా ప్రధాని డా॥ మలన్ విమానములో నేటి రాత్రి బయలుదేరి వెళ్లిరి. ఆయన భార్య, ప్రభుత్వాధికారులు ఆయనతో నుండిరి. మంగళవారమునాడు ఆయన లండన్ చేరును.

### ప్రభుత్వ వ్యయకర్తన సంఘ సమావేశాలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: వ్యయకర్తన సంఘనివేదికను పరిశీలించడానికి కేంద్ర ప్రభుత్వ ఆర్థిక శాఖ స్థాయి సంఘం 6 వ తేదీ నుంచి 16 తేదీ వరకు 10 రోజులపాటు సమావేశం జరుగుతుంది. వ్యయకర్తన సంఘనివేదిక అమలు జరిగే అవకాశం చాలా స్వల్పం అని న్యూఢిల్లీలోని విషయజ్ఞులు అభిప్రాయ పడుచున్నారు.

### భారత ప్రభుత్వ వాణిజ్య కార్పొరేషన్

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: భారత ప్రభుత్వం పేరిట వ్యాపార కార్పొరేషన్‌ను ఒక దానిని స్థాపించడానికి ఎంతవరకు అవకాశం ఉన్నదీ పరిశీలించే నిమిత్తం ప్రభుత్వం ఒక కమిటీని నియమించినది. ఈ సంఘానికి పంజాబ్ శాఖ దేశముఖ్ అధ్యక్షుడు రామనాథ్ గోయింకా, హెచ్. వి. కామత్ ప్రభృతులు సభ్యులు.

### ఫ్రెంచి ఇండియాకు పర్మిట్ల పద్ధతి వాయిదా

పుదుచ్చేరి, ఏప్రిల్ 14: ఫ్రెంచి ఇండియా ప్రాంతాలైన పుదుచ్చేరి కారైకాలల నుండి ఇండియన్ యూనియన్ ప్రాంతాలకు రాకపోకలు జరిపే ప్రజలకు పర్మిట్లు ఇచ్చేపద్ధతి ఏప్రిల్ 15వ తేదీనుండి అమలు జరగవలసి ఉన్నది. కాని ప్రస్తుతం అది కొంత కాలం వరకు వాయిదాపడినదనీ, మొదలు పెట్టే సమయం ప్రకటించ బడుతుందనీ ఫ్రెంచి ఇండియా ప్రభుత్వ ప్రకటన ఒకటి తెలియజేస్తున్నది.

## మన సైన్యం గర్వకారణం కావాలి

### కరియప్ప ఉద్బోధ

కలకత్తా, ఏప్రిల్ 14: దృఢమైన పునాదులపై, దేశమునకు గర్వకారణముగా నుండగల బలీయమైన భారత సైన్యమును మేము నిర్మింపగోరుచున్నాము. ఇప్పుడు మనము స్వతంత్రులము. ఎవ్వరూ మన స్వాతంత్ర్యమును హరించు అవకాశము లేకుండ మేము చేయగోరుచున్నాము. ఇందుకుగాను భారత సైన్యమునకు మన యువకులలో శ్రేష్ఠులు కావలెను అని భారత సేనాధిపతి జనరల్ కరియప్పగారు వంగీయ రక్షాదళ ప్రథమవార్షికోత్సవ సందర్భమున ఉపన్యసించుచు చెప్పిరి.

ప. బెంగాల్ ఐచ్ఛిక భారతదళాంతర్గతమగు ఈ సంస్థ జనరల్ కరియప్పగారికి ఆతిథ్యమొసంగిరి. ఈ భటదళము గ్రామీణులకు సైనికశిక్షణ మొసంగుచున్నది. గత సంవత్సరము ఈ సంస్థ ప్రారంభింపబడెను. అప్పటినుండి దాదాపు 2వేల మంది సరిహద్దు గ్రామస్థులు ఈ సైనిక శిక్షణము పొందిరి.

ప్రధాని డా॥ బి. సి. రాయిగారితో కలిసి జనరల్ కరియప్పగారు కలకత్తాకు 30 మైళ్ళ దూరముననున్న కవాత్ మైదానమునకు వచ్చినప్పుడు మంత్రిభూపతి ముజుందారు గారు, ప్రాంతీయసేనాధిపతి ఇతర ఉన్నతాధికారులు వారికి స్వాగతమొసంగిరి.

భారత సైన్యములో ఒకానొక తరగతికి చెందినవారు, అభిమానము పొందుచున్నవారు ఎవ్వరు లేరని నిర్దిష్టయోగ్యతలు కలవారందరు దానిలో చేర్చుకొనబడుచున్నారని జనరల్ కరియప్పగారు చెప్పిరి. అధికారులకు అత్యవసరమైన గుణములు కొన్ని యుండుట యవసరమగుటచేత సెలెక్షను బోర్డు నిర్ణయములను అందరు అంగీకరించవలెనని కరియప్పగారు కోరిరి.

కమిషను ఉద్యోగము లభించినంత మాత్రముచేత యెవ్వరును నిరుత్సాహపడరాదనిరి. ఆఫీసర్లను ఎంచుకొను విషయమున అన్ని రాష్ట్రములను సమానముగా చూచుచున్నారని, ఏ రాష్ట్రమునకును అభిమానము చూపుటలేదని వారనిరి. ఉత్తములగు ఆఫీసర్లు లభ్యమగుటకుగాను పాఠశాలల, కళాశాలల పాఠ్యక్రమమును మార్చవలసి యుండుననిరి. పాఠశాలల, కళాశాలల పాఠ్యక్రమము విద్యార్థులకు మొదటినుండి నాయకత్వమునకు అవసరమైన గుణములు, బాధ్యతాభారము, ఇతర ఉత్తమ గుణములు అలవరచునట్టిదిగా నుండవలెననిరి.

### బెంగాలీ దళం

కలకత్తా, ఏప్రిల్ 15: భారతీయ సైన్యంలోని పదాతి పటాలాలలో 200 మంది బెంగాలీల దళం ఒకటి కొత్తగా చేర్చబడుననీ, వారికి రాజపుత్ర పటాల శిక్షణ కేంద్రంలో ప్రత్యేక శిక్షణ ఒసంగబడుననీ, సర్వసేనాని జనరల్ కరియప్ప కాంచ్రపారాలో ప్రకటించెను

## 'మధ్యధరాప్రాంతరక్షణ ఒడంబడిక అవసరం'

### టర్కీ విదేశాంగమంత్రి ప్రకటన

వాషింగ్టన్, ఏప్రిల్ 14: "యూరపు ఖండంలో శాంతిని కాపాడటానికి అట్లాంటిక్ ఒడంబడిక చాలదు. ఆఒడంబడిక పద్ధతిమీదనే ఏర్పరచబడిన మరొక ప్రాంతీయ ఒడంబడికవలన టర్కీదేశ భద్రత కాపాడబడుతుందని టర్కీ ఆశిస్తున్నది. మధ్యధరా ప్రాంత దేశాలన్నిటికీ కలిపి ఒకప్రాంతీయ ఒడంబడిక తప్పనిసరిగా ఉండవలెను." అని టర్కీ విదేశాంగ మంత్రి నెక్మెద్దీన్ సాదక్ నేడిచ్చట పత్రికా విలేఖరులతో ప్రసంగిస్తూ హెచ్చరించెను.

అయితే తానీ ఒడంబడికను గురించి అమెరికన్ అధికారులతో ఇంకా ఏమీ సంప్రదించలేదని ఆయన అన్నాడు. ఒడంబడికలో ఏయేరాజ్యాలు చేరవలెనో కూడా చెప్పలేనని ఆయన అన్నాడు.

"ట్రూమన్ సిద్ధాంతం ద్వారా అమెరికా టర్కీకి ఇప్పటికే సహాయం చేస్తున్నది కనుక, మధ్యధరా ఒడంబడికకు కూడా తోడ్పడగలదనే భావిస్తున్నాము ఈ ప్రాంతీయ ఒడంబడికలకు ఉండే విలువ, బలం మొదలైనవి అట్లాంటిక్ ఒడంబడికతో వాటికిఉండే సంబంధం మీద ఆధారపడి ఉండగలవు "అని సాదక్ వివరించెను.

టర్కీ భద్రత అనేక యూరపియన్ దేశాలయొక్క—ముఖ్యంగా బ్రిటన్‌యొక్క—స్నేహంమీద కూడా ఆధారపడి ఉన్నదని అతడుఅన్నాడు.

వాషింగ్‌టన్, ఏప్రిల్ 14: ఉత్తర అట్లాంటిక్ ఒప్పంద పద్ధతినే మెడిటరేనియన్ ఒప్పందమును చేసికొనే విషయమునుగురించి టర్కీ విదేశమంత్రితో చర్చించలేదని అధ్యక్షుడు ట్రూమన్ చెప్పెను. టర్కీ విదేశమంత్రి తనను నిన్న చూచినట్లు చెప్పెను. అది లాంఛనంగా చూడవచ్చునే ననెను.

## గంటల పంచాంగం

విరోధి సం॥ చైత్ర బ॥ చవితి
1949 సం॥ ఏప్రిల్ 16 శనివారం
బ॥ చవితి రా 10-15 అనూ ఘ 52-25 వర్జ్యం సా 7-49 ల 9-22 వ.
బ॥ పంచమి ఏప్రిల్ 17 ఆదివారం
బ॥ పంచమి రా 8-52 జ్యే ఘ 1-32 వర్జ్యం రా 9-31 ల 11-6 వ.

**ఆంధ్రపత్రిక**
విరోధి సం॥ చైత్ర బ॥ చవితి
శనివారం

## ఇండొనీసియా సంప్రదింపులు

ఇండొనీసియా వ్యవహారమును, కార్యక్రమములో చేర్చి, చర్చకు రాజకీయకమిటీకి పంప భారత ప్రతినిధి ప్రతిపాదన అనుసరించి ఐక్యరాజ్యసమితి ఆమోదించెను. గత మాసమున భద్రతామండలి తీర్మానము ననుసరించి సమితి సామరస్యసంఘ అధ్వర్యమున హాలెండు, రిపబ్లికను ప్రతినిధులు సమావేశమై చర్చించనున్న సమయమున సమితి ఈ తీర్మానమును ఆమోదించుట గమనింపతగినది. భారత ప్రతినిధి తీర్మానము హాలెండు,ఇండొనీసియా రిపబ్లికను ప్రతినిధుల చర్చలకు ప్రతిబంధకము కాగలదని నార్వే ప్రతినిధి వాదించి హాలెండు ప్రతినిధివైఖరిని బలపరచుట ఆశ్చర్యముగ కనపడక మానదు. భారతప్రతినిధి చెప్పినట్లు సమితి ఇండొనీసియా వ్యవహారమును చర్చించుట, బటేవియాలో రిపబ్లికనులకు హాలెండు ప్రతినిధులకు జరుగు సంప్రతింపులకు తోడ్పడగలదు.

భద్రతామండలి తీర్మానము ననుసరించి, గురువారము సమితి సామరస్య సంఘ అధ్వర్యమున హాలెండు, ఇండొనీసియా ప్రతినిధులకు చర్చలు ఆరంభమైనవి. హాలెండు ప్రతినిధి ప్రసంగము పూర్వవైఖరినే ప్రదర్శించుచున్నది గాని భద్రతామండలి తీర్మాన ఉద్దేశమును అనుసరించదలచినట్లు లేదు. ఇండొనీసియా భవిష్యత్తుకు సంబంధించిన పథకమును చర్చించుటే ఈ సమావేశ ఉద్దేశమని భద్రతామండలి తీర్మానము సూచించినప్పటికీ,దాని అంతర్యము మాత్రము, ముందుగా రిపబ్లికను ప్రభుత్వమును పునరుద్ధరించుటేనని వేరుగ చెప్పనవసరములేదు. ఆ తీర్మానమును బలపరచుచూ అమెరికా బ్రిటిష్ ప్రతినిధులు అప్పుడు చేసిన ప్రసంగములు ఆ విషయమును వెల్లడించగలవు. తీర్మానమునకు ఆ స్వరూప మిచ్చుట కేవలము హాలెండు ప్రతిష్ఠను కాపాడదలచుట తప్ప వేరు కాదు. అందుకు రహస్యమును, భారతప్రతినిధులు తీవ్రముగ నిరసించియుండిరి. అందువల్ల హాలెండు ప్రతినిధి రిపబ్లికను ప్రభుత్వ పునరుద్ధరణను, యుద్ధవిరమణ ఒప్పందముతోనూ హేగులో జరుగవలసిన రౌండుటేబుల్ సమావేశముతోను ముడిపెట్ట ప్రయత్నించుట అసందర్భముగ కనుపడక మానదు. ప్రప్రథమముగా రిపబ్లికను నాయకుల నిర్బంధమునుండి విముక్తులనుచేసి, జోగ్జకర్తాలో రిపబ్లికను ప్రభుత్వమును పునస్స్థాపించుటఅవసరమని రిపబ్లికను ప్రతినిధివర్గ నాయకుడు డా॥ మహమ్మద్ రోయిమ్ ఉద్ఘాటించుట సహజము. ఐక్యరాజ్యసమితి రిపబ్లికనుల ప్రభుత్వమును గుర్తించినపుడు హాలెండు తక్షణము దాని పునరుద్ధరణకు అంగీకరించకపోవుటలో ఔచిత్యం కనపడుటలేదు.

సామరస్యసంఘ అధ్యక్షుడైన అమెరికను ప్రతినిధి ప్రతిపాదించిన సమాధానపథకముకూడ హాలెండు ముఖమును కప్పిపుచ్చుటకు ఉద్దేశింపబడియున్నట్లున్నది. ఇపుడు జరుగుచున్న సమావేశము కొన్ని నిర్ణయములను చేయవచ్చుననీ, ఆ నిర్ణయములను, పునరుద్ధరింపబడిన వెంటనే రిపబ్లికన్ ప్రభుత్వము ధృవపరచవచ్చుననీ ఆయనపథకము చెప్పుచున్నది. ఈ పద్ధతి రిపబ్లికను ప్రభుత్వ అంతస్తును గుర్తించినట్లుఎట్లవునో వారికే బోధపడవలసియున్నది. వాస్తవమునకు నిర్ణయము లనుపేరుతో షరతులను ప్రతిపాదించిరని చెప్పవలసియున్నది. "రిపబ్లికను ప్రభుత్వ పునరుద్ధరణకు అవసరమైన షరతులను గురించి మొదట చర్చించుటకు అంగీకరించెదము" అన్న డచ్చి వైఖరికి అమెరికను ప్రతినిధి ప్రతిపాదనకు వాస్తవమునకు భేదము లేదని చెప్పవచ్చును. "అవసరమైన షరతులు" అనిన యుద్ధవిరమణ ఒప్పందమును, హేగ్‌లో జరుగవలసిన సభను రిపబ్లికను ప్రభుత్వ పునరుద్ధరణతో ముడిపెట్టుటే అని చెప్పవలసియున్నది. వాస్తవమునకు జరుగవలసినది రిపబ్లికను నాయకులను తక్షణము విడుదలచేసి, అన్ని విషయములందు వారితో ఒప్పందమునకు వచ్చుట. మిగిలిన వారు ఒప్పందమునకు వచ్చిననూ దానికి ప్రజాసమ్మతి, బలము వుండజాలవు. ప్రస్తుతము సంప్రతింపులందు పాల్గొనువారి అధికారము పరిమితము. కాబట్టి అమెరికను, ప్రతినిధి సమాధానపథకము సక్రమసమాధానమునకు, పరిష్కారమునకు దారితీయునని అనుకొనుటకు వీలులేదు. రిపబ్లికను ప్రతినిధి నాయకుడు ఆశించినట్లు హాలెండు ప్రప్రథమమునసే, రిపబ్లికనుల ప్రభుత్వ పునరుద్ధరణకు అంగీకరించి, అసలు రాయబారములు సాగించుటకు తన సహృదయతను ప్రదర్శించవలెను. అగ్రరాజ్యములు అందులో ముఖ్యముగా అమెరికా, ప్రయోజనరహితమైన సమాధానపథకములను ప్రోత్సహించుటగాక, హాలెండు సక్రమమార్గమును అనుసరించునట్లు ఒత్తిడిచేయవలెను. కేవలము సైనికఒప్పందములను చేసికొని ప్రజాప్రభుత్వములను సంఘటితపరచిన చాలదు. తాను సహాయము చేయుచున్న యూరపురాజ్యములు అన్ని విషయములందు ప్రజా ప్రభుత్వ సిద్ధాంతములను, అమలు జరుపునట్లు చూడవలెను. కానియెడల మార్షలుపథకముక్రింద వారందరికి సహాయముచేసిన వారిసామ్రాజ్య విధానమును బలపరచినట్లగును. అట్లాంటికు ఒప్పందమునై సంతకము చేయుటకు హాలెండు ప్రతినిధి అమెరికా వెళ్లినప్పుడు, అమెరికాకార్యదర్శి ఆచిసన్ ఇండొనీసియావిషయమున గట్టి సలహా నిచ్చెనని వార్తలు వచ్చినవి. కాని ఆ సలహాఫలితములు మాత్రము కనుపడలేదు. కాబట్టి అమెరికా గట్టిగా పట్టుబట్టి ఇండొనీసియావ్యవహారమును త్వరలో సక్రమముగ పరిష్కరింపక పోయినయెడల మార్షలుసహాయమును ఇవ్వ వీలులేదని చెప్పవలసి యున్నది. ఒక వంక హాలెండు ఇండొనీసియాలో సైనిక చర్యను, ఆర్థిక దిగ్బంధమును సాగించుచునూ, అమెరికా నుండి మార్షలు పథక సహాయమును పొందుట ఎంత అసందర్భముగనున్నదో, వేరుగ చెప్పనవసరము లేదు. ఈఅంశమును అమెరికనులు విస్మరించరని నమ్మెదము.

## ప్రపంచ బియ్యపు ఉత్పత్తి సరఫరాలస్థితి

### అదుర్దాగానే యున్నదని అంతర్జాతీయకమిటీ భావన

వాషింగ్‌టన, ఏప్రిల్ 14: ప్రపంచ బియ్యపు ఉత్పత్తిని, అవసరములను పరిశీలించి, ఆయా దేశాలకు కేటాయించే పద్ధతిని సాగింపవలెనని అంతర్జాతీయ ఆహార కమిటీ నిర్ణయించినది. అందువల్ల 1949 సం॥నకు చేయవలసిన కేటాయింపులను బియ్యపు కమిటీ కొద్ది వారములలో చేయగలదు. ఈ నిర్ణయమును ఆహార వ్యవసాయ కౌన్సిలుకు సమర్పింపబడును. బియ్యము కమిటీ సిఫార్సులను ఆమోదించుటా కాదా అని కౌన్సిలు ఆలోచించును. 1948 సం॥లో లభ్యమైనంత సరుకే ఈ సం॥ము కూడ లభ్యము కాగలదనీ, పరిస్థితి ఇంకా అదుర్దాగానే యున్నదని కమిటీ భావించుచున్నది.

## మద్రాసు రాష్ట్రంలో

1948 జులై 1 నుండి 1949 జనవరి 31 వరకూ గల 7 నెలలకాలంలో మద్రాసు ప్రభుత్వం 2,75,871 ఎకరాలపై భూమికి 5871 టన్నుల మంచిరకపు విత్తనములను, 12,83,591 ఎకరాలకు 69,168 టన్నుల ఎరువులను, 42,965 టన్నుల పెంటపోగులను సప్లయిచేసినది. 657 ఎలక్ట్రిక్ మోటార్లను, 1,31,150 అడుగుల పైపును, ఇతర యాంత్రిక పరికరములనుకూడ రాష్ట్రప్రభుత్వము సప్లయిచేసినది.

1949 మార్చి 18 తో అంతమైన వారంలో మొత్తం 178½ ఎకరాల బంజరుభూమి సాగుచేయబడెను. ఆ మరుసటివారంలో 392 ఎకరాల బంజరుభూమి సాగుచేయబడెను. ఆ వారంలోనే తయారుచేయబడిన 1291 టన్నుల కంపోస్టు ఎరువులలో 507 టన్నులు పైగను అమ్మబడెను. పైరు తెగుళ్లు, చీడలు చెప్పుకో దగినంతగా కనిపించలేదు.

ప్రస్తుత సంవత్సరంలో సి. పి. రాష్ట్రంలో 2,74,000 ఎకరాల బంజరుభూమి వ్యవసాయమునకు తేబడెను.

## లోకల్‌బోర్డు ఉద్యోగుల కష్టనిష్ఠురాలు

### మంత్రివాగ్దానం

మద్రాసు, ఏప్రిల్ 15: స్థానిక పరిపాలనా మంత్రి శ్రీ కే. చంద్రమౌళిగారు నిన్న సాయంత్రం సైదాపేట జిల్లాబోర్డు హైస్కూలులో చెంగల్పట్టు జిల్లా బోర్డు, హైస్కూలు మినిస్టీరియల్ ఉద్యోగుల ప్రారంభోత్సవమును గావించిరి.

పబ్లిక్ వర్క్సుమంత్రి శ్రీ యం. భక్తవత్సలంగారు అధ్యక్షత వహించిరి.

శ్రీ టి. యం. కృష్ణస్వామినాయుడుగారు క్లబ్బుకార్యదర్శి మంత్రులకు స్వాగతం తెలిపిన పిమ్మట శ్రీ భక్తవత్సలంగారు ఉద్యోగులు ఆఫీసు పనులతోను మరచునట్లుచేయుటకు యిట్టి రిక్రియేషనుక్లబ్బులు యుండుట చాలా అవసరమనిరి. స్థానిక బోర్డుల ఉద్యోగుల కష్టనిష్ఠురములను ప్రభుత్వము సానుభూతితో ఆలోచించునని.

శ్రీ చంద్రమౌళిగారు క్లబ్బు ప్రారంభోత్సవము జరుపుచూ స్థానికబోర్డుల విషయంలో సవతి తల్లి భావమును ప్రదర్శించుచున్నదని ప్రజలలో అభిప్రాయమున్నదనియు, కాని యీ క్లబ్బు ఉభయ సంస్థల అధికారులను కలుపుట, బకుటచేత ఆట్టి భావము పోవుటకు వీలునున్నదనిరి. కాంగ్రెస్ ప్రభుత్వముల ఏర్పడిన తరువాత పరిపాలనా విషయములలో స్థానిక సంస్థలకు ఎక్కువ ప్రాధాన్యము యివ్వబడుచున్నదనియు స్థానికసంస్థల ఉద్యోగులకోర్కెలు సానుభూతితో ఆలోచింపబడుననియు వారు చెప్పిరి.

## కోహినూరు గ్లాసుఫ్యాక్టరీ సమ్మె విరమణ

హైదరాబాదు, ఏప్రిల్ 15: హైదరాబాదులోని కోహినూరు గ్లాసుఫ్యాక్టరీలో ఫిబ్రవరినుండి సమ్మె ఆరంభింపబడెను. కార్మికులకు మిల్లు అధికారులకు రాజీ కుదరడంతో తిరిగి పనిచేయుటకు అంగీకరించిరి. ప్రభుత్వం తరపున డి. యస్. ... గారి మధ్యవర్తిత్వం వల్ల యీ తగాదా పరిష్కారమైనది.

## తూర్పుపంజాబుకు 5గురు ఉపమంత్రులు

సిమ్లా, ఏప్రిల్ 14: తూ. పంజాబు ప్రభుత్వ ఉపమంత్రు లిందరు బహుసుద నేటిసాయంకాలము ప్రమాణమును స్వీకరించిరి. నిన్న ఉపమంత్రిగా ప్రమాణము స్వీకరించిన శ్రీ లాలాకిదార్‌నాథ్ సేగలు గాక నేడు పండిత శ్రీరామశర్మ, చౌదరి కర్తార్‌సింగ్, సర్దార్ అజిత్‌సింగ్, సర్దార్ ... సింగ్, సర్దార్ ... సింగ్ గారలు ప్రమాణము స్వీకరించిరి. ఇప్పుడు మంత్రివర్గములో అగ్గురు ఉపమంత్రు లున్నారు.

### అవినీతిని నిర్మూలింప ప్రధాని కృతనిశ్చయము

ప్రధానిగా అధికారము స్వీకరింపగానే తాను అవినీతినిర్మూలన సంఘ కార్యకలాపములనుగూర్చి ప్రభుత్వ ప్రధానకార్యదర్శితో చర్చించెనని లాలాభీమసేన సాచార్ గారు చెప్పిరి. ప్రభుత్వము వారు నియమించిన సంఘములలోని అనధికారుల పైవచ్చిన ఫిర్యాదులను విచారించుటకు తను అవినీతినిర్మూలన సంఘము యొక్క ఉపసంఘము నొకదానిని నియమింప నిశ్చయించెను. విచారణగావించిన తరువాత ఈ ఉపసంఘము మాతృసంఘమునకు నివేదిక సమర్పించునని ఆయన చెప్పెను. అన్యాయ కార్యములు చేయు గజెటెడ్ ఆఫీసర్ల కేసులను శీఘ్రముగా విచారించి పరిష్కరించుటకు ఒక శాసనమునుగావింప ప్రభుత్వము వారాలోచించుచుండిరని ఆయన చెప్పెను. పరిపాలనలో అవినీతి లేకుండా చేయ తన ప్రభుత్వము కృతనిశ్చయమై యున్నదనిరి.

### ప్రజాహిత జీవనములో కపటము

సిమ్లా ఏప్రిల్ 14: తూర్పు పంజాబు మాజీ ఆర్థికశాఖ మంత్రి చౌదరీ కృష్ణగోపాల్ దత్తుగారు సేవా నిర్మాణ కార్యక్రమ నిర్వాహకుల సభలో ఉపన్యసించుచూ మన ప్రజాహిత జీవితములో కపటము, వంచన ప్రవేశించినవనిరి. మహాత్ముని మహోన్నత ఆశయములను, ఆయన మరణించగానే మనము కాకుల పాలు చేసితిమనిరి. ప్రజాహిత జీవితమును పవిత్రము చేయుట మహాత్ముని ఆశయమై యుండెనని దత్తుగారు చెప్పుచు యిప్పుడు ప్రజాహిత జీవితము కుతంత్రముల మయముగా నున్నదనిరి.

## ఉక్కు కర్మాగారాలను సి. పి. ఒరిస్సాలలో స్థాపించాలి

### ప్రభుత్వానికి విదేశ నిపుణుల సలహా

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: దేశంలో ఉక్కు కర్మాగారాలను స్థాపించే విషయమై పరిస్థితులను పరిశీలించి సలహా ఇవ్వటానికి భారతప్రభుత్వం నియమించిన మూడు విదేశీకంపెనీలు ఏకగ్రీవంగా కర్మాగారాలను తప్పక స్థాపించవలసిఉందని సూచించినట్లు తెలుస్తున్నది. అమెరికన్ కంపెనీలయిన కొపెర్స్ కంపెనీ, మెకీ అండ్ కంపెనీలు కర్మాగారాలను ఒరిస్సా మధ్య రాష్ట్రాలలో నెలకొల్పవలెననీ, ఇనుము కరిగించటానికి అవసరమయ్యే బొగ్గును మద్రాసు రాష్ట్రానికి సరఫరా చేయటం కష్టం కనుక ప్రస్తుతం ఆ రాష్ట్రంలో స్థాపించే ఆలోచన పెట్టుకోవద్దని సూచించినవి. మూడవదయిన ఇంటర్నేషనల్ కన్‌స్ట్రక్షన్ కంపెనీ (బ్రిటిష్) మాత్రం ఇంకొంతవరకు ఉత్పత్తి కావలసిఉంటే దక్షిణదేశంలో ఫ్యాక్టరీని నెలకొల్పేవిషయం తప్పకుండా ఆలోచించవలెనని సూచించినది.

ప్రస్తుతం దేశంలోఉన్న ఉక్కు కర్మాగారాలన్నిటినీ అభివృద్ధి చేసినప్పటికీ దేశ అవసరాలు తీరటానికి ఏటాదికి 10 లక్షల టన్నుల కొరతఉంటుందనీ, ఈ మూడు కంపెనీలవారూ నిర్ణయించిరి. 5 లక్షలు మొదలు 6 లక్షల టన్నులవరకు ఉత్పత్తి చేసే కర్మాగారాన్ని స్థాపించటానికి దాదాపు 50 లేక 60 కోట్ల రూపాయలు అవుతుంది.

## ఐక్య మహారాష్ట్ర పరిషత్

హైదరాబాద్, ఏప్రిల్ 15: ఈ నెల 20వ ప్రాంతాలలో జరుగనున్న ఐక్య మహారాష్ట్ర పరిషత్ కార్యకర్తల సమావేశానికి హైదరాబాదు సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థ, సంస్థాన కాంగ్రెస్ ప్రముఖులు డి. జి. బిందూ వాస్కర్ గార్లు ఆహ్వానించబడినారని తెలుస్తున్నది. ఈసమావేశం భాషారాష్ట్ర విషయమై వాయకత్రయం సమర్పించిన నివేదికను సరించి చర్చించి యీవిషయంలో యికముందు తీసుకోవలసిన కార్యక్రమాన్ని నిర్ణయిస్తుంది. భారతజాతీయ కాంగ్రెస్ కార్యదర్శి శంకరరావు దేవ్ గారుకూడ యీ సమావేశానికి హాజరు కాగలరని భావించబడుతోంది.

## 'ప్రపంచంలో విస్తృత ప్రజాస్వామ్యం'

### దివాకర్ అభిభాషణ

షిల్లాంగ్, ఏప్రిల్ 13: "నూతన రాజ్యాంగంక్రింద 16 కోట్లమంది భారతీయులకు వోటింపు హక్కు లభిస్తుంది. అందువలన భారతదేశం ప్రపంచంలోకల్లా పెద్ద ప్రజాస్వామ్యం కాగలదు." అని ఇండియా ప్రభుత్వంలో ప్రచారశాఖ సహాయ మంత్రిగా నున్న ఆర్. ఆర్. దివాకర్‌గారు నేడిచ్చట పత్రికా విలేఖరుల సమావేశంలో ప్రసంగించుచూ వెల్లడించిరి.

"ప్రపంచంలో భారతదేశపు ఉనికి పట్టుకుగల ప్రాధాన్యతనుపట్టే, దాని సైశాల్యాన్నీ, గత చరిత్రను పట్టే, ఈ దేశం ప్రపంచ వ్యవహారాల్లో అత్యంత ముఖ్య పాత్రను భరించవలసి ఉన్నది. ఈ పాత్రను నిర్వహించవలెనంటే రాజకీయరంగంలోనేకాక, ఆర్థిక, సాంఘిక వ్యవహారాలలోకూడా దేశం బలపడవలెను. నూతన రాజ్యాంగంక్రింద రానున్న 16 కోట్లమంది వోటర్లకు ప్రజాస్వామ్య మూలసూత్రాలనూ, ఉత్తమ పౌర ధర్మాలనూ నేర్పటానికి ప్రచారం చాలా అవసరం." అని ఆయన వివరించెను.

దేశంలో నిరక్షరాస్యత ప్రబలి ఉన్నందువల్ల రేడియో, ఫిల్ములూ ప్రచారానికి చాలాతోడ్పడతవని ఆయనఅన్నాడు. బ్యాటరీతో పనిచేసే చౌకరకపు రేడియో సెట్లను దేశంలో తయారుచేయించుటానికి ప్రభుత్వం పోత్సాహమిస్తుందనీ, దేశంలో రేడియో ప్రచారం ఎక్కువ చేయటానికే మీడియం వేవుమీద ప్రసారంచేసే స్టేషనులు నెలకొల్పబడుతున్నయ్యనీ ఆయన అన్నాడు.

సాధారణంగా ప్రాంతీయ భాషలకే రేడియో కార్యక్రమాలలో ప్రాధాన్యత ఇవ్వబడుతున్నా, జాతీయభాషకు కూడా తగిన స్థానం ఇవ్వటం అవసరమని ఆయన అన్నాడు.

## మన్యజ్వర నిర్మూలనం

### భారతదేశానికి ప్రపంచ ఆరోగ్యసంస్థ సహాయం

వాషింగ్‌టన్, ఏప్రిల్ 14: ప్రపంచ ఆరోగ్య సంస్థ వారు డా॥ సి. యస్. హమ్సన్‌గారిని ఇండియాకు పంపినట్లుగా నేటిరాత్రి ప్రపంచఆరోగ్య ఆహారసంస్థ అమెరికాలో వాషింగ్‌టను నగరమందు ప్రకటించెను. ఇండియాలో తెరాయినద్ద మన్యజ్వరం అతిదారుణంగాఉంది. పాకిస్థానులో తూర్పు బెంగాలులోని ఈశ్వరగాం మైమన్సింఘ ప్రాంతము కూడా అటువంటిదే. ఈ రెండు ప్రాంతములందును మన్యజ్వరమును నిర్మూలించుటకు హమ్సనుగారు యిదటికి విచ్చేయుచున్నారు. ఈ ప్రాంతంలో పరిపూర్ణముగా మన్యజ్వరనిర్మూలనముచేయబడును. ఈ ప్రాంతములో మన్యజ్వరముగూలంగా ప్రజలు ఇచ్చట నివసించలేక వ్యవసాయ భూములను విడిచిపెట్టిపోయిరి. అందువల్ల ధాన్యోత్పత్తి క్షీణించినది.

హమ్సనుగారు ఏప్రెలు 12 తేదీన వాషింగ్‌టనునుండి బయలుదేరిరి. ఢిల్లీకి రేపు చేరగలరు.

## హైద్రాబాద్ రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలు

### 1950 లోగా జరుగవు

హైదరాబాద్, ఏప్రిల్ 15: హైదరాబాద్ రాజ్యాంగపరిషత్తు ఎన్నికలు 1950 లోగా జరుగవని అతివిశ్వసనీయవర్గాల ద్వారా యునైటెడ్ ప్రెస్‌కు తెలుస్తోంది. వయోజనులను ఓటర్లుగా చేర్చే కార్యక్రమం యింకానల్గొండ, ఆత్రాఫ బల్దా జిల్లాలలోను, హైదరాబాద్ నగరంలోను పూర్తికాలేదు. ఓటర్ల జాబితాలను అచ్చువేయటం మరికొంత నెలకాలం తీసుకొంటుంది. ఆక్షేపణలు తెచ్చుకొన్న తర్వాత సకరమైన జాబితాలు అచ్చువేయబడును. ఈ కార్యక్రమానికి కొంత కాలం పడుతుంది. సంస్థానంలో యిప్పటికి దాదాపు 75 లక్షలమంది వయోజనలు ఓటర్లుగా చేర్చబడిరి.

## ఢిల్లీలో కేంద్ర విద్యా పరిషత్తు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: భారత ప్రధాని పండిత నెహ్రూగారు ఏప్రిల్ 18వ తేదీన ఢిల్లీలో కేంద్రవిద్యాపరిషత్తును శంకుస్థాపన చేయుదురు.

## జాతీయట్రేడ్ యూనియన్ సమావేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: భారతజాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ రెండవ సమావేశం మే 7వ తేదీన ఇండోర్‌లో జరుగనుంది. ఉపప్రధాని సర్దార్‌పటేల్ ఈ సమావేశంలో పాల్గొంటారు. అమెరికన్ లేబర్ ఫెడరేషన్ అధ్యక్షుడు విలియం గ్రీన్‌కూడా సమావేశానికి హాజరవుతాడని తెలుస్తున్నది.

## రాజమహేంద్రవరంలో పన్నుల హెచ్చింపు

### మునిసిపల్ కమిషనరు వద్దకు రాయబారం

రాజమహేంద్రవరం, ఏప్రిల్ 12: స్థానికపౌర మహాసంఘ తరఫున అధ్యక్షులు శ్రీ సోమిన కామేశ్వరరావుగారు పురపాలక సంఘ కమిషనర్ ఆర్. లక్ష్మీపతి గారిన్నకు రాయబారంవెళ్ళి హెచ్చు పన్నులవిషయమై చర్చించి, పన్నులు తగ్గించే ఏర్పాటు చేయవలెననికోరిరి. పన్నుల పరిశీలనకై నియమించబడిన రివిజన్ ఆఫీసర్ తనవంతోచినట్లు పన్ను హెచ్చింపు జరిపెనని చెప్పి, యీ విషయమునందలి నిజానిజములు బుజువుచేయుటకు రికార్డులుపరిశీలించు అవకాశము లేనుకీయవలెననీ, పన్నుల హెచ్చింపు సమస్య కౌన్సిల్‌కు అందచేసి తగ్గించబడే ఏర్పాటు చేయవలెననీకూడ, కామేశ్వరరావుగారు కమిషనర్‌నుకోరిరి. రికార్డులు పరిశీలించుటకు అనుమతియిచ్చుచూ, పన్నులతగ్గింపుకై శాయశక్తులాకృషి చేయగలనని కమిషనర్‌గారు వాగ్దానమిచ్చిరి.

## భూముల స్వాధీనం

### కార్పొరేషను అపీల్లు త్రోసివేత

చెన్నపట్నం, ఏప్రిల్ 14: భూము అక్విజిషను వ్యవహారముల ఫలితముగా జరిగిన మూడు దావాల సందర్భములో జనక న్యా॥ కున్ని రామన్‌గారు ఒసగిన తీర్పు గూర్చి కార్పొరేషనువారు హైకోర్టులో దాఖలు చేసిన అపీళ్ళను న్యా॥ సత్యనారాయణరావు, న్యా॥ విశ్వనాథ శాస్త్రిగార్లు త్రోసివేస్తూ విచారణ జడ్జి ఒసగిన తీర్పు న్యాయమైనదే నని, యీ ఆస్తుల మీద ప్రభుత్వమునకు కాని కార్పొరేషనుకు గాని స్వాధీనం హక్కు కలుగ లేదనియు నిర్ణయ మొసగిరి.

త్యాగరాయ నగరులో 4 ఎకరములు 70 సెంట్ల భూమి కార్పొరేషనుకు చెందవలసి యున్నదని కార్పొరేషను పెట్టిన కేసుయమును ఎదిరించుచూ ఆస్తి స్వంతదారులైన మూడు పార్టీలవారు దావాలు చేసియుండిరి. అపుడు న్యా॥ కున్ని రామన్‌గారు దావాలను విని పై భూములమీద కార్పొరేషనుకు ఎట్టి హక్కులేదని తీర్పునొసంగిరి. 1923 సం॥ ప్రభుత్వము తమకుగాను యీ ఆస్తిని స్వాధీనం చేసుకొన్నారని అందువల్ల అది తమదని కార్పొరేషను వారు వాదించిరి.

న్యా॥ కున్ని రామన్ తీర్పు మీద కార్పొరేషను అపీలు చేయగా పై ఆస్తి మీద కార్పొరేషనుకు హక్కు లేదను నిర్ణయముతోనే న్యాయమూర్తులు ఏకీభవించి అపీళ్ళను త్రోసివేసిరి.

## పాకిస్థాన్ దుశ్చర్య

### కాశ్మీర్ జాతీయ పత్రికవిమర్శ

శ్రీనగర్, ఏప్రిల్ 13: కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్సు, అధికార పత్రికయైన "ది కాశ్మీర్" యుద్ధవిరమణ ఒప్పందపు ఉల్లంఘనల నుగూర్చి యిట్లు వ్రాసెను: "పాకిస్థాన్ నీతినియమ రహితంగా ప్రవర్తించుచూ యుద్ధ విరమణ ఒడంబడికను పలుమార్లు భంగపరచింది. దీనివల్ల కాశ్మీర్ పరిస్థితి తిరిగి విషమించగలదనుటలో సందేహములేదు.

జమ్ము కాశ్మీర్ ప్రభుత్వం ఈ ఉల్లంఘనలను భారత ప్రభుత్వం దృష్టికి తేవటం చాలా మంచి పని అయింది. పాకిస్థానీయులను అదుపులో ఉంచటానికి భారత ప్రభుత్వము తగిన చర్యలు తీసుకొనగలదని ఆశించుచున్నాము." యుద్ధవిరమణ ఒడంబడికను భారతీయ సైన్యములు ఎంతో జాగ్రత్తగా హృదయపూర్వకంగా పాటించినవని ఆ పత్రిక ప్రశంసించింది. కాశ్మీర్‌లో పాకిస్థాన్ ప్రభుత్వం ప్లాన్లు వేసుకొని మరీ ఉల్లంఘనలు సాగించుచున్నదనీ కాశ్మీర్ వివాదం పరిష్కరించుటలో పలెను పాకిస్థాన్ నిజంగా కోరటం లేదనీ నేషనల్ కాన్ఫరెన్సు ప్రతినిధి ఒకరు అన్నారు.

## దేవనాగరి లిపిలో రవీంద్రుని రచనలప్రచురణ

కలకత్తా, ఏప్రిల్ 14: సంస్కృతభాషవచ్చినవారు సాకర్యంకోసం రవీంద్రనాథ టాగూర్ రచనలన్నింటిని దేవనాగరి లిపిలో ప్రచురించుటకు, విశ్వభారతి అధికారులు తీవ్రంగా ఆలోచిస్తున్నారు. ఈ ప్రచురణ కార్యక్రమంపు వివరములను పరిశీలించేనుందుకై ఒక కమిటీ నియమింపబడెను. ఈ కమిటీ, ఏప్రిల్ 13న శాంతినికేతనంలో సమావేశమవుతున్నది.

## రైల్వే ఉద్యోగుల కష్టనిష్ఠురాలు

### సంతానంగారి ప్రకటన

మదరాసు, ఏప్రిల్ 15: యస్. ఐ. ఆర్., యం. యస్. యం. రైల్వేలలో అనేక గ్రేడులు, అనేక జీతముల స్కేళ్ళు వున్నవి. వీటినిరోలించుటకు ప్రయత్నించుచున్నాము. ఎన్నికష్టములున్నా, ఎన్ని లోపములున్నా పని జరుగుచూ వుండవలసినదే. ముఖ్యోద్యోగులు తీర్పుటకు సేవ ప్రయత్నించుచున్నాను. ... పనికి ... జీతములకు సంబంధములేదు. సమర్థతను, ప్రజలను రూపాయి ఆదాలలో ... కట్టుటకు వీలులేదని భాగస్వప్రభుత్వ రైల్వేలు, ట్రాన్స్‌పోర్టు ఉపమంత్రి శ్రీ కె. సంతానంగారు నేడు మధ్యాహ్నం యం. యస్. యం. రైల్వే కార్యాలయములో ఉద్యోగులు ఇదర సర్కిల్ సమావేశములో మాట్లాడుతూ చెప్పిరి.

శ్రీ సంతానంగారు మాట్లాడుచూ ఇంకనూ ఇట్లనిరి. ఎందుకంటేగాని రైల్వేలలో అసమర్థత, లంచగొండితనము ప్రబలి నడచే ఆరోపణలున్నవి. నేను కేంద్ర అసెంబ్లీలో సమర్థించవలసి వచ్చినది. రైల్వేలలో 5% లంచగొండితనమువుంటే 95% ప్రశంసనీయముగ పనిచేయుచున్నారు. మనదేశములో జాతీయ వెలపెబడిన వ్యవస్థలలో రైల్వేలు పెద్దవి. జాతీయ ... రైల్వేల నిర్వహణ చక్కబరచవలె ... రాజమార్గాన లేదని మాసంకల్పము. ప్రయివేటు సంస్థలకంటే ఎన్నటికీ జాతీయమైనవ్వు ... చని మరల నొక్కి చెప్పుచున్నాను. దక్షిణాదివారు కష్టపడి పనిచేయువారని ప్రశంసింపబడినారు. కష్టం రాయకుండా పనిచేసే అవసరమైతే భావిపౌరుల ప్రయోజనముకొరకు పనిలో ప్రాణములు ఓడుటకు సిద్ధముగ వుండవలెను అని అన్నారు.

ఉపన్యాసానంతరము శ్రీ సంతానంగారు సభికులు ఏమైనా ప్రశ్నలు వేసిన సమాధానము చెప్పెదననిరి. పలువురు వారివారి ఉద్యోగములను గురించి ఇబ్బందులకు సంబంధించిన ప్రశ్నలు వేయగ శ్రీ సంతానంగారు సమాధానమిచ్చిరి.

చీఫ్ కమర్షల్ మేనేజరు కార్యాలయ అభినందనలు తెలిపిరి. శ్రీ యస్. ఆర్. కల్యాణసుందరంగారు ఉద్యోగుల ప్రశ్నలకు సమాధానము నిచ్చి మంత్రికి ధన్యవాదాలర్పించిరి.

తరువాత శ్రీ కె. సంతానంగారు మదరాసు ఆహారధాన్యాల వర్తకసంఘము వారి రాయబారాన్ని స్వీకరించిరి.

ఆహారధాన్యముల వర్తకసంఘము వారు, ఉత్తర హిందూస్థానమునుండి ఆహారధాన్యములు దిగుమతి చేయుటకు తగ్గించవలెననియు, ఆహారధాన్యముల చేరవేతకు స్పెషల్ వ్యాగనులు నియమించవలెననియు, సరుకు దొంగతనములను అరికట్టవలెననియు, సరుకులను నిల్వచేయుటకు, రేవునుండి సరకులను త్వరగా ఖాళీచేయుటకు మదరాసు రేవును అభివృద్ధి చేయవలెననియు పోర్టు ట్రస్టులో ఆహారధాన్య వర్తకులకు తగు ప్రాతినిధ్యం యివ్వవలెననియు కోరుచు ఒక వినతిపత్రమును సమర్పించిరి.

మంత్రిగారు రాయబారమును విని, కోర్కెలన్నింటినీ శ్రద్ధగ పరిశీలించెదమని చెప్పినట్లు తెలుస్తున్నది. రైల్వేల ఉపమంత్రి శ్రీ కె. సంతానంగారు రైల్వే ఉద్యోగులలో రైల్వే అభివృద్ధిని గురించిన 3 సం॥ముల ప్రణాళికను చర్చించిరి.

శ్రీ సంతానంగారు ఇవ్వాళ రాత్రి ... సాయంత్రం వెళ్లనున్నారు.

## ఢిల్లీకి తిరిగి సచార్ ప్రయాణం

సిమ్లా, ఏప్రిల్ 15: తూర్పు పంజాబు ప్రధానమంత్రి భీమసేనసచార్ ఇవాళ ఢిల్లీకి వెళ్లెను. ఖాద్యాలగారి బృందములో నుండి కూడా కొందరినుండి మంత్రివర్గంలోకి తీసుకోవలెనని లోగడ ఒక ... పావన చేయబడినది. ఈ ప్రతిపాదనను అమలు జరపటంలో ఉన్న సమస్యలను గురించి సర్దార్‌గారితో ఆలోచించుటకు వెళ్తున్నారని తెలియుచున్నది.

## ఢిల్లీకి బర్మాప్రధానిరాక:

న్యూఢిల్లీ, ఏప్రిల్ 15: బర్మాప్రధాని థాకిన్‌నూ కలకత్తానుండి నేడు ఢిల్లీకితిరిగి వచ్చి ప్రధాని నెహ్రూతో కొద్దిసేపు మాట్లాడి, విమానంలో రంగూనుకు బయలుదేరివెళ్ళిరి.

కలకత్తా, ఏప్రిల్ 15: ... అన్నిటిలో ... కలకత్తా అసు ... వక ... ఇరుపక్షాలనూ చర్చించుటకు ... ఉంచగా బలిగొంటిది. ... చర్యలు తీసుకొనబడెను.

# ప్రజాప్రభుత్వములతోను కామన్వెల్తుతోను సహకరించుటే నా విధానం

## బర్మా ప్రధాని థాకిన్ నూ ప్రకటన

కరాచీ, ఏప్రిల్ 14: ఆర్థిక రక్షణ విషయములందు సాధ్యమైనంతవరకు సన్నిహితంగా కామన్వెల్తుతోను ప్రజాప్రభుత్వ విధానమునందు విశ్వాసము కల దేశములతోను కలిసి పని చేయడమే తనవిధానమని బర్మా ప్రధానిథాకిన్ నూ నేడిక్కడ పత్రికావిలేఖరుల సమావేశములో తెలియజేసెను.

బర్మా ప్రభుత్వము యొక్క భారత పాకిస్థాను ప్రధానుల వైఖరి సానుభూతి పూర్వకమైయున్నదని చెప్పెను.

భారత దేశం రిపబ్లికు అయినా కామనువెల్తులో ఉండదలచిన బర్మాకూడ అదేపద్ధతిని కామనువెల్తులో చేర సంసిద్ధత చూపునా అని ప్రశ్నింపగా, "ఆ విషయమును చర్చించవలసినది నా మంత్రి వర్గము" అని సమాధానమిచ్చెను.

కామనువెల్తు సమావేశము బర్మా సమస్యలను చర్చించుటకు కూడుటలేదు కాబట్టి బర్మా సమస్యలను ఆ సమావేశములో ప్రతిపాదించవలెనని నేను పండిత నెహ్రూను, లియాకతాలీఖానలను అడుగలేకపోతిని. అయితే బ్రిటిషు మంత్రులను కలిసికొందురు. కాబట్టి వీరిద్దరికి బర్మా సమస్యలను తెలియజేయుటకు అవకాశం వుంటుందని ఆయన వెల్లడించెను. ఇండియానుగాని, పాకిస్థానునుగాని, ఆర్థిక సహాయము ఏమైనా అర్థించిరా అని అడుగగా, "కావచ్చు కాని, ఇంకా ఇతర విషయములు అనేకంవున్నవి" అని బదులు చెప్పెను.

సైనిక సహాయమేమైనా అడిగితిరా అని అడుగగా "ఏదో కొంతసహాయమడిగాను" అని తప్ప వేరుసమాధానమివ్వలేదు. బర్మా ఆంతరంగిక పరిస్థితి అభివృద్ధి చెందటానికి కొంతకాలం పట్టునని చెప్పుచు కరేనులతో సంధిరాయబారములు భగ్నమవుటకు, కరేనులతో కొంతకమ్యూనిస్టుల ప్రాబల్యముండుటే నని కొంతమంది అభిప్రాయమని, కాని తాను మాత్రం అదేనని ఘట్టిగా చెప్పలేనని తెలిపెను. కమ్యూనిస్టులపైన సమష్టి చర్యతీసికోనే విషయమై తాను లియాకత్ నెహ్రూలతో చర్చించలేదనెను. సరిహద్దులు దాటి బర్మాలోకి కమ్యూనిస్టులు విశేషంగా రాలేదని తెలిపెను. "బర్మాలోని పరిస్థితిని పండిత నెహ్రూకు తెలిపాను. మధ్యవర్తిత్వము అనేది అవుసరమా కాదా అని నిర్ణయించే విషయము ఆయనకే వదలివేశాను, పండిత నెహ్రూ మధ్యవర్తిత్వ సూచనను నేను తిరస్కరించలేదు" అని తెలిపెను. "పండిత నెహ్రూ చేసుందున్నానని నేను చెప్పలేను." రేపు ఇక్కడినుండి ఢిల్లీకి వెళ్ళే లోపుగా లియాకతాలీఖాన్‌గారిని చూసెదను. నేడుదయము జిన్నా సమాధిమీద పుష్పగుచ్ఛము నుంచెను.

### ఇండొనీషియా నుంచి సైన్యాలు వైదొలగాలి

మోయ్‌డన్ (హాలండ్) ఏప్రియల్ 14: డచ్ సహాయక దళాలను ఎక్కించుకుని 'గూటీబిక్', అనే యుద్ధనౌక యీరోజు ఇండొనేషియాకు బయల్దేరింది. ఇందుకు అసమ్మతిగా 3000 మంది డచ్ ప్రజలు సముద్రతీరాన చేరి, పెద్దపెద్ద ప్రకటనలు పుచ్చుకుని నినాదాలు చేస్తూ ఓడరేవులో ప్రదర్శనాలు చేశారు. 'పటాలాలు బారకాసులు కాదు—ఇళ్లు కావాలి'—'సైన్యాలు తిరిగి రావాలి' అని పెద్దపెట్టున నినాదాలు చేశారు.

# 26 కోట్ల డాలర్లతో రాజమహేంద్రవరంవద్ద కాంక్రీట్ డాం కట్టే సంకల్పం

## భారతప్రభుత్వ ఇంజనీరింగు కన్సల్టెంటుచే అమెరికాలో పరిశోధనలు

(ఆంధ్రపత్రిక విలేఖరి)

హైదరాబాద్, ఏప్రిల్ 14: భారతదేశంలోని పెద్ద నదులలో ఒకటైన గోదావరినదినీరాలను, అమెరికాలోని మిస్సిసిపీనదీజలాలవలె సమధిక, సక్రమ, సద్వినియోగానికి తెచ్చే విషయమై అమెరికాలో పరిశీలనా పరిశోధనలు జరుగుతున్నట్లు తెలియవచ్చింది.

భారతప్రభుత్వ ఇంజనీరింగు కన్సల్టెంటు, మిన్నెసోటా విశ్వవిద్యాలయం అధీనంలో వున్న హైడ్రాలిక్ లెబరేటరీ డైరెక్టరు అయిన డాక్టర్ లోరెంజ్ స్ట్రాబ్ ఈ విషయమై కృషిచేస్తున్నాడట. ఈ కృషి లక్ష్యం రాజమహేంద్రవరంవద్ద 25కోట్ల 70లక్షుల డాలర్లు పెట్టి, కాంక్రీట్ డాము ఒకటి కట్టడమని తెలుస్తున్నది.

పరిశోధనల నిమిత్తం 36 అడుగుల వెడల్పు, 60 అడుగుల పొడవుతల ఒక ప్లాట్‌ఫారం ఏర్పాటుచేసి, దానిమీద గోదావరి నది నమోనా నిర్మించారట. ఆ నమోనాలోని కాంక్రీట్ కాలవలలో మిస్సిసిపీ నది నీటిని ప్రవహింప చేస్తున్నారట. నది పడకకు ప్రత్యేకం వీరితెచ్చిన ఇసుక పోశారట. గోదావరినది ప్రవాహం గతులెట్లావుంటవో జాగ్రత్తగా, సూక్ష్మంగా పరిశీలించి, ఆ దేవిధంగా నమోనాలో కూడా ప్రవాహం ఉండేటట్లు చేస్తున్నారట.

మంచి వరదలు వచ్చినప్పుడు గోదావరిలో సెకండుకు దాదాపు 20 లక్షుల ఘనపుటడుగుల నీరు ప్రవహిస్తుంది. అదే స్థితిలో దిగువ మిస్సిసిపీలో కూడా రమారమి అంతే నీరు ప్రవహిస్తుంది.

దక్షిణ భారతదేశంలో కొన్నిచోట్ల వర్షపాతం మొత్తం తరుణానికి 500 అంగుళాలు రకూ ఉండే విపరీతపరిస్థితే గోదావరిలో ఇంత ప్రవాహము ఉండడానికి కారణమని స్ట్రాబ్ అభిప్రాయం.

రాజమహేంద్రవరందగ్గర కట్టే డాముకు తగిన పునాది నిమిత్తం 200 అడుగుల లోతు వరకు తవ్వవలసివుంటుందిట. 428 అడుగుల ఎత్తూ, మైలున్నర పొడుగూ ఉండే ఈ డాము నిమిత్తము మొత్తము సుమారు 20 కోట్ల ఘనపుటడుగుల మట్టి తవ్వవలసి వుంటుందట. డాముకు 8 లక్షుల ఘనపు గజముల కాంక్రీటు కావలెనట.

### ఉల్కాపాతం

న్యూయార్కు, ఏప్రిల్ 12: "న్యూ ఇంగ్లండ్" ప్రాంతంలో కడచినరాత్రి, చాలా తేజోవంతమైన ఉల్క ఒకటి పొవనూపి ఛిన్నాభిన్నంగా బ్రద్దలై పడిపోయింది. దాని తుంపులు రోడ్సుద్వీపమంతా చల్లాచదరుగా పడ్డట్టు కనుపించిందని ఒకవిమాన చోదకుడు చెబుతున్నాడు. ఈ ఉల్క పోర్ట్‌లండ్, మెయిన్ లాంగ్ ద్వీపం, న్యూయార్కుల పొడవునా కనుపించినట్టు చూచినవారు చెబుతున్నారు.

అంతకు కొంచెం ముందుగా న్యూకాసిల్ ప్రాంత గగనంనుంచి ఒక పెద్ద నిప్పుముద్దలాంటిదేదో భూమిమీదికి పడిపోయినట్టు మాశానని, మరొక యుద్ధదళ నైమానికుడు తెలియజేశాడు. విమాన మేదైనా కూలిపోయిందేమోనని భోగట్టా చేస్తే, అల్లాంటిదేదీ జరిగినట్టు వార్తలేమీ లేవని పౌరవిమానశాఖవారు తెలియజేశారు.

### పోలీసులకు కమ్యూనిష్టులకు సంఘర్షణ

#### ముగ్గురు కమ్యూనిష్టుల మరణం

ఖమ్మంమెట్టు, ఏప్రిల్ 14: సూర్యాపేట తాలూకా మాధవరం గ్రామ సమీపాన కమ్యూనిష్టులకు మాధవరంవద్ద నున్న మలబారు స్పెషల్ పోలీసులకు గతరాత్రి సంఘర్షణ జరిగిన సందర్భంలో ముగ్గురు కమ్యూనిష్టులు హతులైనారని వార్తలు వచ్చినవి. ఈ ముగ్గురి పేర్లు: సుంకూరు వెంకటప్పయ్య, బండి వెంకటరెడ్డి, నాగిరెడ్డి చొడారెడ్డి. కమ్యూనిష్టులనుండి పోలీసులు అనేక ఆయుధాలను, మందు గుండుసామానును స్వాధీనం చేసుకొనిరి.

ఇల్లెందు తాలూకా కామేపల్లిగ్రామ వాస్తవ్యులు గంటి పుల్లయ్య, షేక్ సింగ్ అనువారిని మొన్న సాయుధ కమ్యూనిష్టులు కాల్చి చంపిరి. ఒక నెల ప్రశాంతంగా ఉన్నతర్వాత కమ్యూనిష్టులు తిరిగి ఒక వారంనుండి తమ కార్య కలాపాలను ప్రారంభించినారు. మహబూబాబాద్, ఖమ్మంమెట్టు, మూలుగే, ఇల్లెందు తాలూకాలలో యీ వారంలోను నలుగురిని హత్య చేసినారు. ఉపద్రవాన్ని అరికట్టుటకు తీసుకోవలసిన చర్యలను గురించి మూడు రోజులక్రిందట జిల్లా సివిల్ మిలిటరీ అధికార్లు సమావేశమై చర్చించారు.

### రోజుకు 2 వేల పౌనుల విమానటపా

మద్రాసు, ఏప్రిల్ 14: ఏప్రిల్ 1వ తేదీన విమానటపా క్రొత్త స్కీము ప్రారంభింపబడినప్పటినుండీ మద్రాసు నుంచి ఇండియాలోని ఇతర చోట్లకు రోజుకు 2వేల పౌనుల విమానటపా వెళ్లుచున్నదని పోస్టల్ డైరెక్టరు బి. కె. శేలర్ నేడు అ. ప్రె. విలేఖరికి తెలిపెను.

మద్రాసురాష్ట్రంలోని ముఖ్యపట్టణాలన్నిటికీ, దక్షిణసంస్థానాలకూ విమానటపా త్వరలో పంపింపబడునని, ఈ సంవత్సరంలో మద్రాసు, మైసూరు, హైదరాబాదు ఫ్లైయింగ్ క్లబ్బుల సహాయం కోరబడుచున్నదనీ, విమానటపాలను విస్తృతంచేయుటవలన మధుర, తిరునల్వేలి, పాలంకోట, తంజావూరు మున్నగు పట్టణాలకు త్వరలో విమానటపా ప్రయోజనాలు సిద్ధింపనున్నవనీ, అయితే పడమటి కనుమల కావల నున్న పట్టణాలకీ లాభములు కలుగక పోవచ్చుననీ కూడా బి. కె. శేలర్ చెప్పెను.

### ఆస్పత్రి వద్ద మోటారు హారన్‌శబ్దాలు తగ్గింపు

చెన్నపురీ, ఏప్రిల్ 14: మదరాసు జనరలు ఆస్పత్రి యెదుట మోటారు శబ్దాలుతగ్గించమని పోలీసువారు డ్రయివరులందరికి విన్నవించుకొనుచున్నారు. స్టాన్లీ వంతెన వద్ద "హారన్ ఊదరాదు" అనే బోర్డు తగిలించిరి. ట్రాఫికు మోటారులలో పోలీసులు వచ్చి ప్రత్యేక ప్రచారం చేయుచున్నారు. ఇది సఫలమయినచో నగరంలో యితర చోట్ల కూడ యిట్లు చేయదలచిరి.

# యాంగ్సీ ఉత్తరతీరంలో హఠాత్తుగా చైనా ప్రభుత్వ సేనల విజృంభణ

## మొత్తం మూడు కమ్యూనిస్టుదళాల విధ్వంసం

నాన్‌కింగ్, ఏప్రియల్ 14: మూడు మాసాలుగా, స్తబ్దత వహించి అజ్ఞాతంలో వున్న చైనా ప్రభుత్వసేనలు హఠాత్తుగా విజృంభించి పలుప్రాంతాలలో కమ్యూనిస్టు స్థావరాల మీద పెద్దపెట్టున ప్రతిదాడులు సాగించి చెల్లాచెదురు చేస్తున్నయ్.

ప్రస్తుతం తన జన్మస్థానమైన ఆఫెన్యూఆలో, ఇంచుమించు అజ్ఞాతదశలో వున్న జనరలిస్సో చాంగ్ ఉత్తరువుల ప్రకారం ఈ విజృంభణ తిరిగి ప్రజ్వరిల్లుతున్నట్టు తెలుస్తోంది.

నాన్‌కింగ్, ఏప్రియల్ 14: జనరలిస్సో చాంగ్-కై-షేక్ ఉత్తరువులలో ప్రవర్తించునవిగా తలంపబడుతున్న చైనా ప్రభుత్వ విమాన పదాతిదళాలు నిన్నను అకస్మాత్తుగా విజృంభించినయ్. ఈ మూడు మాసములనుంచీ ఇవి స్తబ్దంగా అజ్ఞాతంలో అణగివున్నయ్. కడచినరాత్రి తీవ్రంగా దాడిచేసి, యాంగ్‌ట్సీనది ఉత్తరతీరాన కమ్యూనిస్టుల చేతుల్లోవున్న నాలుగు ప్రధానమైనవంతెవలను స్వాధీనం చేసుకున్నయ్.

ఈరోజు వార్తల్లో, నాన్‌కింగ్‌కు 60 మైళ్లు తూర్పుగావున్న సంకియాంగ్ యంగ్ అనేచోట ప్రభుత్వసేనలు కమ్యూనిస్టుల తాలుకు రెండు రెజిమెంట్లనూ, ఒక బెటాలియననూ, మొత్తంగా తుడిచేసినట్టు భోగట్టా తెలుస్తున్నది.

తన జన్మస్థానమైన ఆఫెన్ ఘూఅ పట్నంలో ఇంచుమించు అజ్ఞాతంలో వున్న జనరలిస్సో చాంగ్ హఠాత్తుగా ఈ ప్రతిదాడులకు ఉత్తరువులు జారచేసినట్టు తెలుస్తున్నది. కోమింగ్‌టాంగ్ ప్రభుత్వంలోని కన్సర్వేటివ్ వర్గానికీ, పీపింగ్‌లో కమ్యూనిస్టులతో సంధిరాయబారాలు నెరపటానికి తన అనుచరవర్గాన్ని పంపిన తాత్కాలిక అధ్యక్షుడు లీ ట్సుంగ్-ఎన్‌కూ మధ్యయేర్పడ్డ భేదాభిప్రాయాలు మరింత విస్తృతం కావటమే ఇట్టి ఈ ఉత్తరువులు జారీకావటానికి కారణమని అనుకుంటున్నారు. అయితే ఈవార్తల సత్యాసత్యాలు ఇంకా యాథిగా తేలలేదు. ఈ పన్నెండు రోజులనుంచి సాగుతున్న అనధికార సంప్రదింపుల అనంతరం, అధికార కార్యక్రమం ప్రారంభమైందనీ, పీపింగు సంధి సంప్రదింపులు ముందుకు సాగుతున్నాయనీ కమ్యూనిస్టు వర్గాల నుంచి తెలుస్తున్నది. తాత్కాలికాధ్యక్షుడు లీకి, సంధి సంప్రదింపుల వివరాలు నివేదించటానికి నాన్‌కింగు వచ్చిన రాయబారవర్గ ప్రతినిధి హ్యూయాంగ్-హిన్‌ఛల్-హ్స్యాఅంగ్ ఈరోజు పీపింగుకు తిరిగి వెళ్ళకుండా నిలచిపోయాడు. అనిలవటానికి గల కారణమేమిటో తెలియటంలేదు. సంవత్సరాంతంలోగా చైనా సర్వస్వాన్నీ స్వాధీనం చేసుకోవటం కమ్యూనిస్టుల పథకమైనట్టు చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర సంఘ సభ్యుడు ఎన్‌పి-ఓప్ తెలుపుతున్నాడు.

శిథిలమైపోయిన పరిశ్రమల నన్నిటినీ పునరుద్ధరించి, ఒక అయిదు సంవత్సరాల అవధిలో చైనా పారిశ్రామికరంగాన్ని స్థాయీకరించటానికి కమ్యూనిస్టులు ప్రయత్నిస్తున్నారని యీయన అన్నట్టు కమ్యూనిస్టు కొత్త చైనా వార్తాసంస్థ తెలుపుతున్నది.

### వివిధ రాష్ట్రాలలో ఆహారోత్పత్తి

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: మంచి విత్తనములను, ఎరువులను రైతుల కందజేయుట ద్వారా, మద్రాసు రాష్ట్రం 1948 జులై 1 నుండి, 1949 జనవరి 31 వరకూ గల మధ్యకాలంలో 1,25,000 టన్నుల ఆహారధాన్యములను అధికంగా ఉత్పత్తి చేయగలిగినదని భారత వ్యవసాయశాఖ వారికి చేరిన తాజా నివేదికలవలన తెలియుచున్నది.

ఇతర రాష్ట్రాలలో, ఆహారోత్పత్తి రంగంలో ఈ దిగువ కార్యక్రమం అవలంబించబడుచున్నది.

బొంబాయిలో చిలగడ దుంపల ఉత్పత్తికి ప్రభుత్వం ధనసహాయం చేయుచున్నది.

సి. పి. బీరార్ రాష్ట్రంలో పుచ్చ పట్టని గోధుమరకములను సృష్టించుటకై మూడేండ్ల కార్యక్రమం అవలంబింపబడుచున్నది.

పశ్చిమ బెంగాలులో 1400 ఎకరాల బీడుభూములను సాగుచేయుటకు ప్రభుత్వము, కొన్ని ప్రైవేటు ఏజెన్సీలు పని చేయుచున్నవి.

### ప్రత్యేక న్యాయస్థానాల నిబంధన

హైదరాబాద్, ఏప్రిల్ 13: హైదరాబాద్ మిలిటరీ గవర్నరు 1948 అక్టోబరు 30న అమలు పరచిన ప్రత్యేక న్యాయవిచారణ సంఘాల నిబంధనలో, ఈ న్యాయస్థానాలలో శిక్షింపబడినవారు హైకోర్టుకు అప్పీలు చేసుకొనే అవకాశాన్ని ఏర్పరుస్తూ ఒక సవరణ చేయాలని మిలిటరి గవర్నరు నిర్ణయించినట్లు నేడు ఒకప్రకటన తెలియజేయబడెను. ఇందుకు అనుగుణంగా ఆ నిబంధనలో సవరణ చేయబడుతోంది.

### జర్మనీలోని ఫ్యాక్టరీలు

#### పరిహారంక్రింద తీసికొన అమెరికా బ్రిటన్‌లఒప్పందం

వాషింగ్టన్, ఏప్రిల్ 13: యుద్ధనష్ట పరిహారం క్రింద పడమటి జర్మనీలోని ఫ్యాక్టరీని ఊడదీసి పట్టుకొని పోవుటకు అమెరికా బ్రిటన్ ఫ్రాన్సులు చిట్టచివరకు ఒక ఒడంబడికకు రాగిలిగినవని, అమెరికా విదేశాంగ కార్యాలయం నేడు ప్రకటించింది. జర్మనీ నుంచి బయటికి పంపుటకు మొట్టమొదట తయారు చేసిన ఫ్యాక్టరీల జాబితాలో నుంచి 159 ఫ్యాక్టరీలు మినహాయించబడును.

యూరోపియన్ పునరుద్ధరణ కార్యక్రమమునకు వినియోగించుటకు గాను, యీ ఫ్యాక్టరీలన, ఉపదీయకుండా ఉంచుతారట. ఇవి 32 ఉక్కు ఫ్యాక్టరీలు, 88 లోహపు ఫ్యాక్టరీలు, 32 రసాయనిక వస్తూత్పత్తి ఫ్యాక్టరీలు, 7 నాన్ ఫెర్రస్ ఫ్యాక్టరీలు.

### బెర్లిన్‌పై సోవియట్ దిగ్బంధన తొలగుతుందా?

బెర్లిన్, ఏప్రిల్ 13: సోవియట్ రష్యాపై ఇటీలో తలవనితలంపుగా ఆకస్మికమైన మార్పువచ్చిందనీ, యేమైనాసరే నా, బెర్లిన్ నగరంపై దిగ్బంధన తొలగిపోవచ్చునని కొందిరోజులుగా యిక్కడ ఎక్కువగా వదంతులు ప్రబలినవి. ఈ వదంతులు యింకా నృఢపడలేదు.

ఒకవేళ రష్యన్లు దిగ్బంధనను తొలగించేయెడ, ఆహారము, బొగ్గు, కొలది గంటలలోనే, గ్రాక్కుల్లాలు, జలమార్గాల ద్వారా నగరంలోకి వచ్చిపడగలవు. అని పాశ్చాత్యమిత్రమండలి అధికారులు నేను అంచనా వేయసాగు మొదలు పెట్టారు.

# వింధ్యప్రదేశపరిపాలన కేంద్రప్రభుత్వస్వాధీనం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: ఇటీవల వింధ్యప్రదేశ సంస్థానాల యూనియన్‌లో చెలరేగినక్లిష్టపరిణామాల దృష్ట్యా అక్కడి పరిపాలనను స్వయంగా చేపట్టడానికి కేంద్రప్రభుత్వం నిర్ణయించింది.

స్థానిక కమిషనర్ భోనర్ పరిపాలనను స్వాధీనం చేసుకునేటట్లు ఉత్తరువులు జారీచేయబడినై. ఈయనకు సాయపడటానికి సంస్థానాలశాఖ ఒక అధికార దళాన్ని పంపుతున్నది.

అక్కడి మంత్రులు తమలోతాము కీచులాడుకుని సర్దార్ పటేలు ముందు పరస్పరం నిందారోపణలు చేసుకున్నారు. వీరందరినీ రాజీనామాలు దాఖలుచేయవలసిందిగా పటేల్‌జీ ఉత్తరువు చేశారు. రాజీనామాలు దాఖలైనయ్.

వింధ్యప్రదేశంలో కొన్నిప్రాంతాలను మధ్యపరగణాలలో కలిపివేస్తారని తెలుస్తోంది.

### అమెరికా పసిఫిక్ కోస్తాలో భూకంపం

సియాటిల్, ఏప్రిల్ 13: ఇవాళ అపరాహ్ణం అమెరికా పసిఫిక్ సముద్రంలోని పశ్చిమోత్తర కోస్తాలో అపూర్వమైన తీవ్రతతో భూకంపం వచ్చింది. భూకంపంవలన అనేక లక్షల డాలర్ల విలువ చేసే ఆస్తి ధ్వంసమైపోయినది. కనీసం 5 మంది అయినా నిహతులైనారని తెలియవచ్చినది. అగణిత సంఖ్యాకులు గాయపడిరి. భూకంపంయొక్క అఘాతం ప్రధానంగా సియాటిల్, టాకోమా, ఒలింపియా ప్రాంతంలో తగిలినది.

పారిస్, ఏప్రిల్ 12: పాలస్తీనా తాత్కాలిక మధ్యవర్తిగా తాను నిర్వర్తించవలసిన కార్యకలాపం పరిసమాప్తమైనదని డా॥ రాల్ఫ్ బంచ్ నేడిక్కడ ప్రకటించెను.

### మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 15:

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎర్ర కోస్తాగిద్దంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతో సహా) బజారు(కొత్తది)

రు. 170-0-0, 170-8-0

వేరుసెనగనూనెఎక్సుపెల్లర్ (గ్యారంటీ) (సేల్సుటాక్సుతో సహా) రు. 340-0-0

ఆముదం బజారుడెలివరీ ఎక్సుపెల్లర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గలది మొదటి రకం రు. 350-0-0

కొంకాయనూనె (39 పౌను గలడబ్బా) ఒకటికి రు. 32-12-9

పంచదార

"కామ్బ్రౌ" (2 అందరు) రు 90-4-0

అనకాపల్లి" (2 అందరు) రు. 89-8-9

### న్యూయార్కు దూది

న్యూయార్కు, ఏప్రిల్ 14:

మే 32.92/32.93 జూలై 32.11/32.13 అక్టోబర్ 29.07/29.07 డిశంబరు 28.81/28.81 మార్చి 28.68/ నా. మే 28.47/ నా. జూలై 27.45/27.45.

| | | |
|---|---|---|
| మిడ్లింగ్ | హాజరు | 34.11 |
| మే | (గరిష్ఠధర) | 32.93 |
| | (కనిష్ఠధర) | 32.76 |

మే వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | ధర | 32 82 |
| నిన్న | | 32.69 |
| ,, ముగింపు | ధర | 32 92 |
| నిన్న | | 32 80 |

SISTA'S DAY—4

# హైదరాబాదు జైళ్లలో యమయాతనకు స్వస్తి

## డెటిన్యూలకు సెక్యూరిటీ ఖైదీలకు కొన్ని సౌకర్యాలను కల్పిస్తూ సంస్థాన ప్రభుత్వ ఉత్తర్వు

హైదరాబాద్, ఏప్రిల్ 14: హైదరాబాద్ సంస్థానంలోగల జైళ్ల పరిస్థితులను ఇండియా జైళ్ల పరిస్థితుల స్థాయికి తెచ్చుచు సంస్థాన ప్రభుత్వం ఒక నిబంధనను అమలు జరిపినది. దీని ప్రకారం హైదరాబాద్ జైళ్లలోని డిటెన్యూలు ఇండియా జైళ్లలోని డిటెన్యూలు మాదిరిగా చూడబడుదురు. ఈ నిబంధన ప్రకారం సెక్యూరిటీ ఖైదీలు, ఎ. బి. సి అని మూడు తరగతులుగా వారి విద్యాయోగ్యతలు, వారి పూర్వపు ప్రతిపత్తుల ననుసరించి విభజింపబడెదరు. సాధారణంగా వారు ఒకరితో ఒకరు ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొనుటకు అనుమతించబడెదరు. వారు స్వంత దుస్తులను, పక్కలను వాడుకొనుటకు గూడ అనుమతించెదరు. విచారణలో ఉండి పోలీసు లాకప్పులో నున్నవారికి నిర్ణయించబడినంత గాని, అట్లా గాక అతడు జైలులోగాని నిర్బంధంలో నుంచబడేటట్లయితే ఎ బి. సి. తరగతుల వారికి నిర్ణయించబడినంత గాని ఆహారం ఒసంగబడును. ఆహారం విషయంలో ఆ ఖైదీలు తమ స్వంత ఏర్పాట్లు చేసుకోటానికి కూడ అనుమతించబడవచ్చును. ప్రతి సెక్యూరిటీ ఖైదీకి రోజున కు పావుజా న్సు టీ యివ్వబడును. ముందుగా అధికారుల అనుమతి పొంది, అధికారులకు ముందుగా తెలియజేసిన బంధువు వద్దనుండిగాని, స్నేహితుని వద్దనుండిగాని "ఎ" తరగతి ఖైదీ అయినచో 20 రు.లకు ఎక్కువగాకుండా 'బి' తరగతి ఖైదీ అయినచో 10 రు లకు ఎక్కువ కాకుండా తెప్పించుకోవచ్చును. కమిషనర్ చేతగాని, సూపరింటెండెంట్ చేతగాని లిఖిత పూర్వకమైన అనుమతి లేనిదే ఏ సెక్యూరిటీ ఖైదీకూడ ఒక్క పోలీసు అధికార్లతో మినహాగా యితరు లెవరితోను ప్రసంగించకూడదు. పోలీసు అధికారి ఎదుట 'ఇంటర్వ్యూలు' ఏర్పాటు చేయబడును. 'ఏ' తరగతి ఖైదీఅయినచో పక్షమున కొకసారి 'ఇంటర్వ్యూ' ఏర్పాటుచేయబడును. ఇంతేగాక ఆ ఖైదీ తన వ్యవహారాలను పరిష్కారం చేసుకొంటానికి రెండు ఇంటర్వ్యూలు అనుమతించబడును. ఒక్కొక్క ఇంటర్వ్యూలలో ముగ్గురుకంటె ఎక్కువమంది అనుమతించబడరు. చాలదగ్గరి బంధువులైనచో 5 మందివరకు అనుమతించబడుదురు. సెక్యూరిటీ ఖైదీ, తాను నిర్బంధించబడిన జైలుకు అనుబంధంగా గ్రంథాలయం ఉండినచో అక్కడి పుస్తకాలు, మాగజైనులు చదువుకొనుటకనుమతించబడును. వార్తాపత్రికలుకూడ చదువుకోవచ్చును. వారానికి వారు రెండు ఉత్తరాలు పంపవచ్చును. నాలుగు ఉత్తరాలు అతనికి రావచ్చును. ఏదైనా ఉత్తరం నలిపివేయబడినప్పుడు ఆవిషయం ఖైదీకి తెలియజేయబడును. ఉత్తరాలు అధికారులచే 'సెన్సారు' చేయబడును. ఒకజైలులో ఉన్న సెక్యూరిటీ ఖైదీ, వేరొక జైలులోఉన్న సెక్యూరిటీ ఖైదీకి స్వంత విషయాలను గురించి, ప్రయివేటు విషయాలను గురించి వ్రాసుకొనుటకు అనుమతించబడవచ్చును. అవకాశం ఉన్నచోట్ల 'ఎ' తరగతి ఖైదీకి ఒకకుర్చీ, బల్ల, మంచం సప్లయిచేయబడును. ప్రతి సెక్యూరిటీ ఖైదీకి వేపపుల్లలు, సప్లయిచేయబడును. ఎ, బి, తరగతుల ఖైదీలు తమ స్వంత సబ్బుతో సబ్బుబిళ్లలు కొనుక్కొనుటకు అనుమతించబడెదరు. ప్రయాణాలు చేయవలసి వచ్చినప్పుడు 'ఎ', 'బి' తరగతుల ఖైదీలకు ఇంటరు తరగతిగాని, రెండవ తరగతిగాని ఒసంగబడును. 'సి' తరగతి ఖైదీలకు తక్కువ తరగతి ఒసంగబడును.

## హైద్రాబాదు జాగీర్దారీ పరిపాలనా నిబంధన

హైదరాబాద్, ఏప్రిల్ 13: సంస్థానంలోని జాగీర్దార్ల వారి ప్రతినిధులు చేసిన సూచనల దృష్ట్యా హైదరాబాద్ ప్రభుత్వంచే తయారు చేయబడిన జాగీర్దారీ పరిపాలనానిబంధన నూతన ముసాయిదా భారత ప్రభుత్వమునకు పంపబడినదని తెలియుచున్నది. ఈ ముసాయిదా ఢిల్లీనుండి వచ్చినతర్వాత సంస్థానంలోగల జాగీర్దార్లందరకు పంపబడును. తర్వాత సంస్థాన ప్రభుత్వ అధికార్లు, జాగీర్దార్ల ప్రతినిధులతో ఒక 'రౌండు టేబిల్' సభ జరిపి జాగీర్ల రద్దుననుసరించి, జాగీర్దార్లకు యివ్వవలసిన పరిహారాన్ని గురించి అంతిమ నిర్ణయాలు చేయబడును.

## సంస్థాన ఆంధ్రకాంగ్రెస్ స్థాయిసంఘ సభ

హైదరాబాద్, ఏప్రిల్ 13: హైదరాబాదు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు స్థాయి సంఘము మే నెల 10, 11, 12తారీకు

## మే 16 న రాజ్యాంగ పరిషత్సమావేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: గత జనవరి 8 వ తేదీ తీర్మానానుసారం, భారత రాజ్యాంగ పరిషత్తు మే 16 వ తేదీ సోమవారంనాడు పునస్సమావేశం కానున్నదని నేడు అధికారరీత్యా ప్రకటింపబడినది.

లలో హైద్రాబాదు నగరములో సమావేశమగునని, కార్యవర్గం తీర్మానం చేసింది. కార్యవర్గ సమావేశములు మొన్న ఉదయముతో సమాప్తమైనవి. అధికారుల అవినీతిని గురించి, ఆంధ్రాధికారులకు జరుగుచున్న అన్యాయమును గురించి, కమ్యూనిస్టు ఉపద్రవాన్ని గురించి మిలిటరీ గవర్నరుతో విన్నపము చేయుటకై రాష్ట్ర కాంగ్రెసు తరఫున ఒక రాయబారవర్గమును పంపుటకు కూడా నిర్ణయం చేయబడెను.

## సర్ఫికాస్‌కచేరీలలో కాలు పెట్టరాదని సాహెబ్జాదాలకు నవాబు హుకుం

హైదరాబాద్, ఏప్రిల్ 14: సర్ఫికాస్ కచేరీలలో పెట్టరాదని, నిజాంనవాబ్ చేసేనరకూ ఈ హుకుం నేడు యేడుగురు సాహెబ్జాదాలకు హుకుం పంపించాడు. మళ్ళీ వేరే హుకుం అమలులో వుంటుంది. మీర్ హసనల్లీఖాన్, మీర్ మహమ్మదల్లీ ఖాన్, మీర్ మునిరుద్దీన్ ఖాన్, మీర్ ఖాదరల్లీఖాన్, మహబూబల్లీ ఖాన్, మీర్ రియాసతల్లీఖాన్, మీర్ సర్దారల్లీ ఖాన్ ఈ యేడుగురికి ఈ హుకుం అందింది.

## తాతసొత్తు అల్లునికి దానం!

నవాబు, తన తాత సుల్తాన్ ఉల్-ముల్క్ తాలూకు పాయిగాను, ఆయన కొడుకులు అయిదుగురి హక్కునూ అలక్ష్యంగా తోసివేసి, తన అల్లుడయిన నవాబ్ నషీన్ నవాజ్ జంగ్‌కు దఖలుపరుస్తూ ఒకఫర్మానా చేసినట్లు తెలిసింది. సుల్తాన్-ఉల్-ముల్క్ మతిభ్రమణంతో ఒక నెలరోజుల క్రితమే మరణించాడు. సర్ వికారుల్ ఉమ్రా పాయిగాకు అతడు అధిపతి. ఆయనకు అయిదుగురు కొడుకులు, పెద్ద కుటుంబం ఉన్నది. పెద్ద కొడుకు నవాబ్ అబ్దుల్ ఫతేఖాన్ మిలిటరీ గవర్నర్‌కి, మంత్రులకి ఈ విషయం తెలియపరుస్తూ, నిజాంచర్యకు అసమ్మతి తెలిపి, ఈ విషయంలో వారి జోక్యం అర్థించాడు. మిగతా నలుగురు కొడుకులూ కూడా అధికారులకు ఇదేవిధంగా అర్థించారు.

## శిస్తు రెమిషను

పోలీసుచర్యలకుపూర్వము, తదనంతరము, అశాంతి పరిస్థితులవల్ల సాగుచేయకను, పంట దిగుబడి లేకను వున్న ప్రదేశాలలోని భూములకు శిస్తు రెమిషన్ ఇస్తూ ప్రభుత్వం ఉత్తరువుచేసింది. ఈ రెమిషన్ 1358 ఫసలీ ఖరీఫ్ అర్, రాబీ పంటలకు వర్తిస్తుంది.

## హైదరాబాద్‌లో నూతనజిల్లా ఏర్పాటు

హైదరాబాద్, ఏప్రిల్ 13: నిజాం నవాబు సర్ఫ్‌ఖాస్ ములలో భాగమైన బఘాత్, అత్రాఫ్‌బల్దా, ఈ రెండు కలుపబడి ఒక క్రొత్తజిల్లాగా ఏర్పాటు చేయబడుననీ, యీ కార్యక్రమం ఒక పక్షం రోజులలోగా జరుగుననీ తెలుస్తోంది. పైరెంటిని కలిపివేయుట పూర్తికాగానే, 17 వ జిల్లా ఏర్పాటును గురించి గజెటు ప్రకటన ద్వారా తెలియచేయబడును.

## ఆంధ్రపత్రికల ప్రదర్శనం

చెన్నపట్నం, ఏప్రిల్ 14: వచ్చే మాసం విజయవాడలో జరుగనున్న ఆంధ్రరాష్ట్ర పత్రికా సంపాదకుల సంఘ మహాసభ సందర్భంలో ఆంధ్రపత్రికల ప్రదర్శనం కూడా ఒకటి జరుగనున్నది. ఈ ప్రదర్శనానికి సమాచారశాఖ మంత్రి శ్రీ ఎం. భక్తవత్సలంగారు ప్రారంభోత్సవం జరుపుతారనీ, హైదరాబాదు నుంచి వెలువడే 'గోలకొండ పత్రిక' సంపాదకుడు అధ్యక్షత వహిస్తారనీ తెలుస్తున్నది.

# 'ప్రజల సహాయార్థం స్వంత ధనమివ్వాలి'

## నిజాం నవాబుకు కాశీనాథరావు విజ్ఞప్తి

హైదరాబాద్, ఏప్రిల్ 14: సంస్థానంలో ప్రజాబాహుళ్యం గడచిన జీవితాపుసరాలు సమృద్ధిలేని దుర్భర దారిద్ర్యంలో మరకిల్లుచుండగా, కోట్లకొలదీ సహాయలు నవాబుగారి ధర్మ వృథాగా మూటలలో మూలుగుతున్నవనీ, నవాబుగారు ఆ ధనపు మూటలముడులు సడలించి ప్రజలకు సహాయపడవలెనని కాశీనాథరావు వైద్యగారు నేడు ఒక విజ్ఞప్తిచేసిరి.

వైద్యగారు ఈ మధ్య సంస్థానం వివిధ ప్రాంతాలలో విస్తారంగా పర్యటించి ప్రజల స్థితిగతులు ఆకళింపు చేసుకొని వచ్చారు. నేడు సంస్థానంలో ప్రజలు, హిందువులు, ముస్లిములు కూడా చాలా కష్టస్థితిలో వున్నారనీ కనుక నవాబు ఈ పని చేయాలనీ వారు ఈ విజ్ఞప్తిలో కోరారు.

## హైదరాబాద్ ప్రభుత్వ కొత్త సభ్యుల నియామకం

### అధికారప్రకటన

హైదరాబాద్, ఏప్రిల్ 14: హైదరాబాద్ ప్రభుత్వంలో ఆర్థిక, పారిశ్రామిక వాణిజ్యశాఖల సభ్యుడుగ సి. వి. ఎస్ రావు; సివిల్ సప్లయిలశాఖ సభ్యుడు పి. హెచ్. కృష్ణరావుగార్లు, నిన్నటినుండి, నియమింపబడినట్లు నేడు అధికార ప్రకటన వెలువడింది.

ఈ క్రొత్త నియామకాలతో, ప్రభుత్వ సభ్యుల సంఖ్య, మిలిటరీ గవర్నరుతో కలిపి, 7 అయింది. వీరిలో నవాబ్ జైన్ యార్జంగ్, రాజా ధోండిరాజ్ ఇద్దరే ముల్కీలు.

## విచారణ నిబంధనలలో మార్పు

అసమగ్రత, అక్రమ ప్రవర్తన, దుర్వర్తన ఆరోపణలకు గురిఅయిన ప్రభుత్వోద్యోగులపై విచారణజరిపించుటకు ఏర్పరచిన నిబంధనలలో కొంత మార్పు చేయబడింది. ఇట్టి విచారణలు జరుపుటకు నియమింపబడే సంఘములు తమ నివేదికలను మిలిటరీ గవర్నరుకు కాక ప్రభుత్వానికి దాఖలు చేస్తాయి. వాటిమీద ప్రభుత్వం తీసుకొనే చర్యలపై ఉద్యోగులు మిలిటరీ గవర్నరుకు అప్పీలుచేసుకొనే అవకాశం కలిగించబడింది.

### మిలిటరీ గవర్నరు

ఉదకమండలం, ఏప్రిల్ 14: హైదరాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ జయంత్ నాథ్ చౌదరి, కుటుంబసహితంగా నిన్న నిచ్చటికి వచ్చారు. వీరిచ్చట నాలుగైదురోజులు విశ్రాంతి తీసికొని, 19-వ చెన్నపట్నం వెడతారు. అక్కడ చెన్నరాష్ట్రానికి, హైదరాబాదుకూ సంబంధించిన విషయాలపై ఆరాష్ట్రప్రభుత్వ ప్రతినిధులతో సంప్రతిస్తారు. పిమ్మట 21-వ హైదరాబాదుకు తిరిగి వెళతారని తెలిసింది.

# వయోజన ఓటర్ల జాబితా కార్యక్రమం

హైదరాబాద్, ఏప్రిల్ 13: త్వరలో జరుపబడనున్న హైదరాబాద్ రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలకు సంబంధించి వయోజనులను ఓటర్లుగా చేర్చు కార్యక్రమం నల్లగొండ జిల్లాలో మినహాగా మిగిలిన జిల్లా లన్నిటిలోను పూర్తి అయినది. నల్లగొండ జిల్లాలోకూడ త్వరలోనే యీ కార్యక్రమం పూర్తి కాగలదని భావించబడుతోంది.

## సంస్థానంలో వ్యవసాయ సంస్కరణలు

హైదరాబాద్, ఏప్రిల్ 18: సంస్థానంలో చేయవలసిన వ్యవసాయ సంస్కరణలనుగురించి ప్రభుత్వానికి సిఫార్సు చేయుటకు యీ నెలాంతంలోగా వ్యవసాయ సంస్కరణలసంఘం ఒకటి ఏర్పాటుచేయబడునని అధికారరీత్యా తెలియవచ్చింది. భూమిశిస్తు మొదలైన వ్యవసాయ సమస్యలలో నిపుణుడైన సంస్థానం బయటి వ్యక్తి ఒకడు యీ సంఘమునకు అధ్యక్షునిగా నియమించబడును.

ఇదేవిధంగా సంస్థానంలోని కార్మికుల స్థితిగతులను విచారించటానికికూడ ఒక సంఘాన్ని నియమించాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది. ఈ సంఘం కార్మికుల వేతనాలు, ఇండ్ల సౌకర్యాలు, మొదలైన వాటినిగురించి, ప్రక్కనున్న రాష్ట్రాలలోని కార్మికచట్టాలకు అనుగుణంగా సంస్థానంలోకూడ కార్మిక చట్టం ప్రవేశపెట్టటాన్ని గురించి ప్రభుత్వానికి సిఫార్సుచేయును. సంస్థానంలో కమ్యూనిస్టు ఉపద్రవాన్ని నిర్మూలించటానికిగాను ప్రభుత్వం యీ చర్యలు తీసుకొంటోంది. "సంస్థానంలో కమ్యూనిస్టు పలుకుబడి పెరగటానికి ఏ ఏ కారణాలు తోడ్పడినవో వాటిని తొలగించవలెనని మా ఉద్దేశ్యం." అని ఒక అధికారి చెప్పెను.

## అత్రాఫ్ బల్దా జిల్లాలో అదనపు సైన్యాల ఏర్పాటు

హైదరాబాద్, ఏప్రిల్ 18:— "అత్రాఫ్ బల్దాజిల్లాలో కమ్యూనిస్టు ఉపద్రవం పెరుగుతోందని గమనించి, ప్రభుత్వం అక్కడ అదనపుబలాలను ఏర్పాటు చేసిందని తెలియవచ్చింది. నల్లగొండ, వరంగల్లు జిల్లాలలో పరిస్థితి కొంతవరకు శాంతపడింది. ఆ జిల్లాలలో యింతవరకు దాదాపు 4000 మంది కమ్యూనిస్టులు అరెస్టుచేయబడిరి.

## పటేలు వద్దకు రాయబారం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: హైదరాబాద్ సంస్థానంలో ముస్లిముల కష్టనిష్టూరాలను విన్నవించుకొనే నిమిత్తం యానస్‌సలీమ్ నాయకత్వాన ముస్లిముల ప్రతినిధివర్గ మొకటి నేడు భారత ప్రభుత్వ ఉపప్రధానమంత్రి సర్దార్ వల్లభాయిపటేలును సందర్శించారు. అనంతరం వారు, ప్రధానామాత్యుడు పండిత నెహ్రూను

## కావలెను

గుంతకల్ మునిసిపాలిటీ, గుంతకల్

దిగువఉద్యోగమునకు దరఖాస్తులు అర్హతగలవారినుండి 21-4-49 తేదీవరకు కోరబడుచున్నవి. ఉద్యోగము ఖాయమైనది. దరఖాస్తుదారులు, తమ అర్హతలు, వయస్సు, కులము, అనుభవము మొదలైనవి తెలియపరచవలెను.

| ఉద్యోగం పేరు: | స్కేలు: |
|---|---|
| 1. పి. డబ్ల్యు. సూపర్ వైజరు | రు 100-5-160 లున్ను మామూలు డియర్‌నెస్ అలవెన్సు, సైకిల్ అలవెన్సున్ను. |

ఐ. రాజారావు నాయుడు,
స్పెషల్ ఆఫీసరు.

## కావలెను

బెజవాడలోని బాలికల మిషన్ అజరయ్య హైస్కూలుకు సీనియర్ తెలుగు పండిట్, తెలుగు మాట్లాడగల మ్యూజిక్ టీచరు, డ్రాయింగ్ టీచరు కావలెను. మొదటి రెండు ఉద్యోగములకు స్త్రీలే దరఖాస్తు చేయవలెను.

ప్రిన్సిపాల్.

## టెండరు నోటీసు

ఏలూరు మునిసిపల్ ఆఫీసు, ఏలూరు

ఇందుమూలముగా తెలియజేయునదేమనగా: 1949-50 సంవత్సరమునకు 5 టన్నుల బ్లీచింగ్ పౌడరు సప్లయి చేసే నిమిత్తము, ఏలూరు మునిసిపలు కమీషనరుగారిచే 25-4-1949 తేది సాయంత్రము 4 గంటలవరకు సీలువేసిన టెండర్లు అందుకొనబడును.

ప్రతి టెండరుతోను, బజానా మొత్తము క్రింద మునిసిపలు ట్రెజరీలో రు 150/-లు చెల్లించినట్లు రసీదు దాఖలుచేయబడవలెను. టెండరు షరతులు, యితర వివరములు, మునిసిపలు ఇంజినీరుగారికి రు 1/- చెల్లించి వారివద్ద పొందవచ్చును.

ఎం. బషీర్ అహమ్మద్,
9-4-49. కమీషనర్.

## ప్రకటన

వేటపాలెం శ్రీ వెంకటేశ్వర కాఫీమాన్యుఫాక్చరింగ్ కంపెనీలో 17-3-49 సంవత్సరమున వరలో భాగస్థుడు ప్రత్తి మల్లిఖార్జునరావు పై కంపెనీలో భాగము వదులుకొని వేరే అతడు స్వంతముగ వ్యాపారము చేయుచున్నాడు. మిగిలిన భాగస్థులందరును సదరు 17-3-1949 తేదీనుండి పై పేరుతో వ్యాపారము చేయుచున్నారు గనుక సదరు ప్రత్తి మల్లిఖార్జునరావుకు ఈ కంపెనీలో ఏలాంటి సంబంధమున్ను లేదని ఇందుమూలముగా ఎల్లరకు తెలియజేయడమైనది.

ఇట్లు,
కోమూరి సాంబశివుడు,
ప్రొప్రయిటరు,
శ్రీ వెంకటేశ్వర కాఫీ మాన్యుఫాక్చరింగ్ కంపెనీ.
వేటపాలెం, 14-4-49.

Edited printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press No 7 Thambu Chetty St Madras.

## వర్తక ఒప్పందమునకు బ్రిటను రష్యా సంప్రతింపులు

లండను, ఏప్రిల్ 14: ఏతూ[?]ముల మీదనైతే ఒక ఏడాదిపాటు అమలునందుండే వర్తక ఒడంబడికను గురించి, రష్యా బ్రిటనుల ప్రాథమిక సంప్రతింపులు జరపినట్లు విదేశీ వర్తకశాఖా కార్యదర్శి జార్జి బాటంలీ నేడు పార్లమెంటులో తెలిపెను. వాణిజ్యమంత్రి హెరాల్డు విల్సన్, బాటంలీ లండనులో సోవియటు వర్తక ప్రతినిధివర్గ నాయకునికి చర్చలు జరిగినవని తెలియజేసెను. అమెరికను వర్తిడికి లొంగిపోయి సోవియటు రష్యాతో వర్తకము తగ్గించుకొనిన దేశములో నిరుద్యోగసమస్య అధికమవునని ప్లాటినేమల్సు చెప్పగా, "మేము ఒప్పందము చేసికొను ఆసక్తితోయున్నాము, సంప్రతింపులకు మావల్ల ప్రతిబంధకములు కావు" అని బాటంలీ చెప్పెను. రక్షణ అవుసరములను పురస్కరించుకొని, కొన్ని ఎగుమతులను కట్టుబాటుచేయుటవల్ల తూర్పు యూరపుతో పరస్పర ప్రయోజనకరమైన వర్తకమును సాగించుటకు అభ్యంతరముండదని కూడ చెప్పెను.

## బ్రిటిషు బడ్జెట్ కు కామన్సు ఆమోదం

లండన్, ఏప్రిల్ 18: సర్ స్టాఫర్డు క్రిప్సు ప్రతిపాదించిన బడ్జెటును కామన్సు సభ గత రాత్రి ఆమోదించింది. కార్మిక పక్ష సభ్యులలో కొద్దిమంది తప్ప తక్కిన వారందరూ వోటింగులో పాల్గొనిరి. కన్సర్వేటివ్ లు తటస్థంగా ఊరకొనిరి. కమ్యూనిస్టు సభ్యులతో కలిసి మొత్తం 8 మాత్రమే ప్రతికూలంగా వోటు చేసిరి. బడ్జెటుకు అనుకూలంగా 302 వోట్లు వచ్చినవి.

## 19మంది నాజీ నాయకులకు శిక్షలు

నూరెంబర్గు, ఏప్రిల్ 14: నూరెంబర్గులోని అమెరికన్ న్యాయస్థానం నేడు 19 మంది పూర్వపు నాజీ పరిపాలకులకు, రాజ్యతంత్రజ్ఞులకు వివిధకాల శిక్షలు విధించినది. ఈ శిక్షలలో అత్యధికమైనది 25 సం॥ కారాగార నిర్బంధం. నేటి తీర్పులతో 14½ నెలలనుండీ సాగుచున్న యుద్ధ నేరస్థుల విచారణలు సమాప్తమైనవి. నేటి అంతిమ విచారణ 13వది.

యుద్ధసమయంలో హిట్లర్ విదేశాంగ శాఖలో ప్రథమప్రముఖుడైన్న ఎర్నెస్టువాన్ వైజ్సెకర్ దురాక్రమణయుద్ధమునకు ప్లానులు తయారుచేసినా దన్న నేరంపైన, మానవజాతిపై నేరములు చేసినా దన్న ఆరోపణపైనా 7 ఏండ్ల జైలుశిక్ష విధింపబడెను. హిట్లర్ ఛాన్సెలరీ ముఖ్యుడైన ఆట్టో మైస్నర్, హంగరీకి మాజీ నాజీ రాయబారి ఆటో ఎర్డ్మన్స్ డార్ఫ్ విడుదల చేయబడిరి.

హోంశాఖా కార్యదర్శి విల్హెల్మ్ స్టాకర్టు 8 సం॥ 10 మా॥ 20 దినములు మాత్రమే జైలుశిక్షవిధించబడెను. ఈ శిక్ష నతడిదివరకే అనుభవించెను. కనక అతడు వెంటనే విడుదల చేయబడును. ఇక అతని నేమాత్రం నిర్బంధంలో ఉంచినా మృతిచెందునని డాక్టర్లు చెప్పుటచే అతనికి అంతస్వల్ప శిక్ష వేయబడెను.

ప్రతివాదులలో పెక్కురు తాము పై అమెరికన్ అధికారులకు అప్పీలు చేయుటకు ప్రయత్నించెదమని అన్నారు.

ఒకటవ ప్రతివాది కౌన్సెలు రాష్ట్రీకి న్యాయవాదియైన డా॥ కుబుషాక్ నేటి తీర్పు అంతయు రద్దుచేయబడవలెనని అన్నాడు న్యాయస్థానము వారికి విచారణాధికారము లేదనీ, వారి వాదములు తప్పుతడకలనీ కూడ అతడన్నాడు. కాని విచారణ ఇంత వరకూ వచ్చిన తరువాత ఇట్లువాదించుట అయుక్తమని న్యాయస్థానము దానిని త్రోసిపేసెను

దోషులలో ప్రతివారిపైనా ఈక్రింది నేరములలో ఒకటో, లేక అంతకన్నెక్కువో ఋజువుపరుపబడినవి: కుట్ర, దురాక్రమణ యుద్ధమునకు ప్లానులు తయారుచేయుట, యుద్ధ ఖైదీలను హింసించుట, వధించుట, దేశములను కొల్లగొట్టుట, కార్మిక బానిసత్వపు విధానము మున్నగు మానవజాతిపై నేరములు. నేర సంఘ సభ్యత్వము,

నాజీ రహస్య పోలీసుల ముఖ్యకార్యాలయ ప్రధానాధికారి టాట్లాడ్ బెర్గరుకు 25 ఏళ్ల శిక్ష, హంగరీలోని ముఖ్య ప్రతినిధి ఎడ్మండు వీసెన్ మేయరుకు 20 ఏళ్ల శిక్ష, యుద్ధ ఆయుధసామగ్రి ఉత్పత్తి కార్యాలయముఖ్యుడు హన్స్ కెహియల్ కు 15 ఏళ్ల శిక్షా విధింపబడెను.

25 ఏళ్ల శిక్ష ఒకనికి, 20 ఏళ్ల శిక్ష ఇద్దరికి, 15 ఏళ్లు ముగ్గురికి. 10 ఏళ్లు ఇద్దరికి. 7 ఏళ్లు ఆరుగురికి, 6 ఏళ్లు ఇద్దరికి; 4 ఏళ్లు ఒకనికి, 3 ఏళ్ల 10 మాసముల 20 రోజులు ఒకనికి విధింపబడెను ఇద్దరు విడుదల చేయబడిరి.

## "మా పరపతిని స్వలాభానికి వినియోగించం"

### పట్టాభిగారి సమక్షంలో సత్యాగ్రహుల ప్రమాణం

హృషికేశం, ఏప్రిల్ 14: డా॥ పట్టాభి సీతారామయ్యగారు నేటి ఉదయం ఇచటకు వచ్చినప్పుడాయనకు బ్రహ్మాండమైన స్వాగతమివ్వబడెను. పెద్ద ఊరేగింపుకూడా జరిగి గంగా తీరంలో గాంధీఘాట్ వద్ద ముగిసెను. తరువాత వివిధ సంఘము లాయనకు సన్మాన పత్రములు సమర్పించెను. వారాయనకు గాంధీ నిధి నిమిత్తం 101 రూ. పర్సు ఒకటి, 1001 రూ. పర్సు ఒకటి కూడచేర్చిరి.

వివిధ కాంగ్రెసు కమిటీలకు చెందిన కాంగ్రెసు సత్యాగ్రహులు సత్ప్రవర్తన ప్రమాణము చేయుచు మహాత్మ గాంధీ సూత్రముల పట్ల విశ్వాసమును ప్రకటించిరి.

"నా పలుకుబడిని స్వలాభం కొఱకుగాని, దుర్ప్రయోజనములకైగాని వినియోగించను." అని ప్రతిసత్యాగ్రహియు ప్రమాణ మొనర్చెను.

## ఎన్నికలైన తరువాతనే సంపూర్ణ స్వరాజ్యసిద్ధి

### ప్రజలు ఓపికపట్టాలని రాష్ట్రపతి హితవు

హరిద్వార్, ఏప్రిల్ 14: "యథార్థమైన, సర్వసంపూర్ణమైన స్వరాజ్యం కావలెనని ప్రజలు కోరుచున్నట్లైతే, ఈ సారి ఎన్నికలు పూర్తి అయ్యేవరకు ఓపికపట్టాలి" అని రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు గంగానదీ తీరాన సుభాష్ఘట్టంలో నిన్న సాయంకాలం ఒక బహిరంగసభలో ఉపన్యసిస్తూ ప్రజలకు హితబోధచేశారు. "యథార్థమైన స్వరాజ్యమనగా, కలిమిలేముల తారతమ్యములో నిమిత్తంలేకుండా సర్వజనులకు సరిసమానమైన ఓటింగు హక్కుండుట అన్నమాట. కొత్తనియోజకవర్గాలు తయారైన తరువాత, 17 కోట్ల జనాభాకు ఓటింగు అధికారం లభిస్తుంది. ఈ 17 కోట్లలో సగంమంది స్త్రీలు.

ఓటింగ్ సమయంలో, ప్రజలు యుక్తాయుక్త వివేకముచూపాలి. దుష్టశీలురారకు తమ ఓట్లనిస్తే దుష్ట ప్రభుత్వం యేర్పడుతుంది. లంచాయిపుచ్చుకొనే వ్యక్తికి ఓటిస్తే, ప్రభుత్వం మంత్రియైన తరువాత గూడ అయన లంచాలు పుచ్చుకొనడా? ప్రజలు తమ ఓట్లనునెన్నడూ విక్రయించగూడదు. ప్రభుత్వ నిర్మాతలు ప్రజలే. వాస్తవికమైన అధికారం ప్రజల చేతుల్లోనే ఉంది. ఓటింగ్ అధికారంగల ప్రతి వ్యక్తి తానే పరిపాలకుడని, భావించుకొని, వాస్తవికమైన స్వరాజ్య నిర్మాణములో తనకుగల బాధ్యతను తను గుర్తెరిగి యుక్తాయుక్త, పరిజ్ఞానంతో తనఓటింగ్ అధికారం ఫలాయించాలి" అని రాష్ట్రపతి పట్టాభిగారు ఉద్బోధించిరి.

## లక్నో పరిసరాలలో రైల్వే కట్టు దిట్టాలు

### పంజాబు ఎక్సుప్రెస్ ప్రమాదకారణంగా

లక్నో, ఏప్రిల్ 14: బెనారస్ కంటోన్మెంటు స్టేషనువద్ద పంజాబు ఎక్స్ప్రెస్ పట్టాలు తప్పిపోయిన మూలకంగా, లక్నో సర్కిలులోని పోలీసులు రైల్వే మార్గమును 24 గంటలూ జాగ్రత్తగా కాచుచుండవలెనని ఉత్తర్వులివ్వబడిరి.

ముఖ్యంగా సి. ఐ. డి. లు అప్రమత్తతగా నుండవలెనని, పల్లెప్రాంతాలగుండా పోయే రైలుమార్గంలోని వంతెనలు వగైరాలను గ్రామ పెద్దల సహాయంతో పోలీసులు పరిరక్షించుచుండవలెనని కూడ ఆజ్ఞాపింపబడెను.

## మార్షల్ సహాయపు దుర్వినియోగం

### వియన్నా ద్వారా రష్యాకు రహస్య రవాణాలు

వాషింగ్టను, ఏప్రిల్ 18: మార్షల్ సహాయ కార్యక్రమం క్రింద పంపబడే వస్తు సామగ్రులు వియన్నా ద్వారా సోవియట్ యూనియనుకు చేరవేయబడుచున్నందున అమెరికన్ ప్రభుత్వం తీవ్రంగా ఆందోళన పడుచున్నది. ఈ రహస్య రవాణాను అరికట్టుటకై గట్టి చర్యలు తీసుకొనవలెనని విదేశాంగ శాఖ ఆలోచించుచున్నట్లు కూడ తెలియుచున్నది.

రష్యాకు వెళ్లే ఈ రహస్య రవాణాలకు ఆస్ట్రియన్ పారిశ్రామిక సంస్థలు కారణమని యునైటెడ్ ప్రెస్ ఆఫ్ ఇండియా వారికి తెలిసినది.

## సర్దార్ పటేల్ తో చర్చలకై తిరువాన్కూర్ మహారాజా ప్రయాణం

తిరువేంద్రను, ఏప్రిల్ 14: తిరువాన్కూరు, కొచ్చిన్ సంస్థానాలను ఏకం చేయుట మూలంగా ఉత్పన్నమయ్యే సమస్యలను, అనగా సంస్థానాధీశ్వరుని రాజకీయ హోదా, ఆయన స్వంత ఆస్తి, ఆయనకివ్వబడే భరణము మున్నగు వానిని గూర్చి సర్దార్ పటేల్ తో చర్చించు నిమిత్తమై తిరువాన్కూరు మహారాజా నేటి ఉదయం ప్రత్యేక విమానంలో ఢిల్లీకి బయలుదేరెను. ఆయన ఢిల్లీలో ఒక వారం రోజులుండును.

తిరువాన్కూరు అధిపునికి 20 వేల ఎకరాల స్వంత భూమి, 16 వేల ఎకరాల పూర్వీకుల ఆస్తి ఉన్నది.

ఆయన స్వంత ఖర్చులకు, దివాణపు ఖర్చులకు అయ్యే మొత్తం ఖర్చు ఏడాదికి 27 లక్షల రూ॥ పై చిలుకు ఉంటుంది. (ఇది సంస్థానపు రివిన్యూలో నూటికి 8వ వంతు ఉండును.)

## సంస్థాన తమిళకాంగ్రెస్ అధ్యక్షుని అరెస్టు

నాగర్ కోయిల్, ఏప్రిల్ 14: తిరువాన్కూరు నందలి తమిళప్రాంతములను మద్రాసురాజధానిలో కలిపివేయవలెనని కోరుచూ తిరువాన్కూరు తమిళనాడు కాంగ్రెస్ వారు సత్యాగ్రహము ప్రారంభించిరి. తత్ఫలితముగా తిరువాన్కూరు తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షుడు నథేనియలు నిన్న అర్ధరాత్రి సమయమున అరెస్టు చేయబడెను. ఈ సందర్భమున పోలీసులు తిరువాన్కూరు శాసనసభ సభ్యులను శ్రీ ఆర్. కే. రామ్ గారిని, వాలంటీరు దళాధిపతి గంధి రామన్ గారిని, కార్యాచరణ సభ్యుడు శ్రీ పి. ఎస్. మణిగారిని అరెస్టు చేసిరి.

## కేంద్రప్రభుత్వ మంత్రి గాడ్గిల్ గదిలో చోరులప్రవేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: కేంద్రప్రభుత్వకార్యాలయమున, గనులశాఖా మంత్రి గాడ్గిల్ గారి గదిలో నిన్న రాత్రి దొంగతనమునకు ప్రయత్నం జరిగింది. దొంగలు గదిలో ప్రవేశించి మంత్రిగారి డ్రాయర్లు వెదకినట్లు, ఏమియో అపహరించినట్లు, పార్లమెంట్ వీధి పోలీసుస్టేషనుకు అందిన ఫిర్యాదును బట్టి తెలుస్తోంది.

గది కిటికీకి అమర్చబడిఉన్న అద్దాలను పగులగొట్టి దొంగ లోపల ప్రవేశించాడట.

కొద్ది వారాలక్రితం ఆరోగ్య శాఖా మంత్రిణి కార్యాలయములో యీ విధముగా దొంగతనమునకు ప్రయత్నం జరిగినదని తెలియుచున్నది.

పూర్వం లాహోరు నగర వాస్తవ్యుడు గజదొంగగా పేరు కలిగిన ఒక వ్యక్తి చేసిఉంటాడని పోలీసులు అనుకొనిరి. ఈ దొంగ దేశవిభజన అనంతరం లాహోర్ నుంచి మకాం మార్చుకొన్నాడు.

## మచిలీపట్నంలో గాంధి విగ్రహాల విధ్వంసం

మచిలీపట్నం, ఏప్రిల్ 14: గతసంవత్సరం చమ్మనగిరిపేట శివాలయం ఎదుట, మునిసిపల్ పార్కులోను ప్రతిష్ఠింపబడిన గాంధీజీ విగ్రహాలు నేటిఉదయానికి పగులగొట్టబడి యున్నవి. ఎవరో కొందరు దుర్మార్గులు ఆ విగ్రహాలను అక్కడనుండి తొలగించాలని ప్రయత్నించగా ఆ ప్రయత్నంలో విగ్రహాలు జారిపడి, వాటి అవయవాలు విరిగిపోయినట్లు కనుపించుచున్నది, పోలీసులు యీ విషయాన్ని గురించి దర్యాప్తు చేయుచున్నారు. మునిసిపల్ అధికార్లు విగ్రహాలను పరిశీలించారు.

## దేశోద్ధారకునికి చీరాల పత్రికారచయితల జోహార్లు

చీరాల, ఏప్రిల్ 12: స్థానిక పత్రికారచయితల సంఘ యాజమాన్యాన రావుల దేవేంద్రనాథం పంతులుగారి అధ్యక్షతను మొన్న దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి 12వ వర్ధంతి జరుపబడెను. సాయంకాలం జరిగిన బహిరంగ సభలో దేశోద్ధారకుని జీవితచరిత్ర, వారు ఆంధ్రుల ఔన్నత్యమునకు చేసిన సేవలనుగురించి ఎం. సత్యనారాయణ, సి. ఎల్. కాంతం, చింతలపాటి జంక పేశ్వర్లు ప్రసంగించి వారికి జోహారు లర్పించిరి. పంతులుగారి పేర నేటికిని ఒక స్మారక చిహ్నము ఏర్పాటు కానందుకు చింతిల్లుతూ, అట్టి పనికి వెంటనే పూనుకోవలసిందని ఆంధ్ర నాయకులను కోరుతూ ఒక తీర్మానం చేసిరి.